శ్రీరామచంద్రయోగి గురు పరబ్రహ్మణేనమః

# ఓం
# అచల సాధన సోపానము

( జన్మ రాహిత్యమునకు మార్గము )



గ్రంధకర్త

కటేశ్వరరావు - రాజయోగి

1992



శ్రీరామ చంద్రయోగి గురు పరబ్రహ్మణేనమః

# ఓం
# అచల సాధన సోపానము

( జన్మ రాహిత్యమునకు మార్గము )






పొన్నాల వెంకటేశ్వరరావు
రాజయోగి

# అచలసాధన సోపానము

ప్రథమ ముద్రణ 1992
ప్రతులు 500

వెల రూ. **15-00**



ప్రతులకు
పొన్నాల వెంకటేశ్వరరావు, రాజయోగి
శోభా ఫార్మశి
నరసాపురం ప॥ గో॥ జిల్లా
534 275



ప్రింటింగు : రాజ్యలక్ష్మి ప్రెస్ నరసాపురం.

# ముందుమాట

హిందూమతము అతిపవిత్రమైనది. అతి ప్రాచీనమైనది. దీనియందు సరియైన అవగాహన లేక పండితపామరులు మూఢనమ్మకాలకులోనై భక్తి విషయములో అనేక యాతనల పొలగుచు దరిగానక వివిధమార్గముల ననుసరించుచు చివరి విషయం అంతుచిక్కక ప్రకృతి సుఖ సౌఖ్యముల కొఱకే భక్తిని పాటించుచున్నారు. ఈ తరుణములో ముక్తిమార్గము నకు విష్ణు సూర్య పరంపరగా వస్తున్న విధానము శ్రీకృష్ణుని భగవద్గీతా విధానములలో జన్మ రాహిత్య విధానమును శ్రీ శివరామ దీక్షితులవారు అచలముగా క్రమమైనసులువైన సూక్ష్మమైన పద్ధతి ప్రకారము ప్రచారము చేసిరి. అయిననూ ఇది కృష్ణసాంప్రదాయమే. దానిని వ్యాసమహర్షి అందరి అభిరుచుల కొఱకుఎవరికి కావలసిన విధానమువారనుసరించు సౌలభ్యము కొఱకు భగవద్గీతను రూపొందించినారు. ఎవరికి ఏమార్గము ఏ అభిరుచిగలదో. దానిని తీసుకొనుటకు భగ వద్గీత తగియున్నది. అందుచేతనే భగవద్గీతను 100 మంది పండితులకు ఇచ్చి భాష్యమును వ్రాయమంటే 100 విధ ములుగా వ్రాయుదురేగాని ఒకేవిధముగా వ్రాయలేరు.

నాకు యీ 'అచల సాధన సోపానము' వ్రాయవలెనను తలంపు సాహసము యేనుగువానిలంక వాస్తవ్యులైన నా గురువరేణ్యులు శ్రీమద్గంగిపాముల శ్రీ రామచంద్ర యోగీం ద్రులవారి కరుణాకటాక్షవీక్షణముల నుండి ఇందు వ్రాయ

బడిన అంశములునాలోధారగా ప్రవహించుచుండుట వల్లనే కలిగినది. కాని దీనిని వ్రాసేంత పాండిత్యము నాలోలేదు. ఇందు పొందు పర్చబడిన రామాయణ, భారత, భాగవత ములలోని అంశములు పెద్దలవలన హరికథల వినికిడివలన తీసుకున్న వేగాని వాటిని నేనెన్నడు చదవలేదు. నాకు భాషా జ్ఞానముకూడ తక్కువే.

లోకములోగల విభిన్న మతములలోని మానవులు వారి వారి ప్రవర్తన, ప్రతిమతములోనుగల గొప్పగొప్ప భక్తులు వారి ప్రవృత్తులు అవగాహన చేసుకొని నాగురువర్యుల వారి బోధామృత సారము యొక్కధార యీ చిన్ని గ్రంథమునునాచేత వ్రాయించినది.

అహం రహితమూ భ్రాంతి రహితములే జన్మరాహిత్య మార్గము. జన్మరాహిత్య మార్గమునకు గల సోపానములలో ఇది ప్రథమ సోపానము. దీనినందుకున్న వారు తప్పకజన్మ రాహిత్యము చెందెదరని ఆశిస్తున్నాను. పూర్వ జన్మ సుకృత విధానము వలన ఒక్కొక్కరికి ఒక్కొక్క విధానము నందుఅభిరుచి గలుగును.

సర్వేజనాఃసుఖినో భవంతు

ఇట్లు

విధేయతతో_

గ్రంథ కర్త

# విషయసూచిక



| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 3 | వారవి | వారు |
| ,, | 4 | దేవుళ్ళు | దేవుళ్ళ |
| 3 | 4 | చిలి | చిరి |
| 7 | 6 | దేవనా | వేదనా |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 29 | 7 | జన్మ | జన్మలో |
| " | 8 | చెడులు | చెడుల |
| 30 | 9 | జన్మలో | జన్మ |
| ~~—~~ | ~~9~~ | ~~పునర్జన్మ~~ | ~~పునర్జన్మలో~~ |
| 44 | 9 | అనసూయలు | అనసూయ |
| 48 | 1 | రేడియోవర్త 14 | రేడియోవా |
| 53 | 17 | తమల | తమకు |
| 56 | 3 | బడియున్నను | పడియున్న |
| 76 | 1 | శారిని | వారిని |
| " | 11 | అనువారుల | అనువారలు |
| 78 | 1 | మంతోచ్ఛారణ | మంత్రోచ్ఛా |
| " | 7 | అంటు. | అంటు, |
| 79 | 5 | హని | హాని |
| 81 | 16 | చనిపోయిన | చనిపోయినవా |
| 89 | 21 | భక్తివిషయము | భక్తివిషయమ |
| 90 | 2 | వితావక్ష | వివక్షతా |
| " | 21 | నిశ్శబ్ద | నిశ్శబ్దమే |
| 92 | 6 | యున్నరు | యున్నారు |
| 95 | 5 | పత్స్వని | తప్పని |
| " | 7 | నేనును | నేను |
| 96 | 11 | చున్నాను | చున్ననూ |
| 97 | 12 | భుక్తి | భుక్త |
| 98 | 21 | బాధపడేదరు | బాధపడెదరు |
| 100 | 3 | ననిమ్మిన | నమ్మిన |

అచల సాధన సోపానము

ఓం

మాతృదేవోభవ, పితృదేవోభవ



గ్రంథకర్తకు జన్మనిచ్చిన తల్లిదండ్రులు

శ్రీ పొన్నాల సూర్యనారాయణ, కనకమ్మ గార్లు

ఓం

గురుదేవోభవ

శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయ అచల పీఠాధిపతులు

గ్రంధకర్తకు జన్మసార్థకము చేసిన గురుదేవులు



శ్రీమత్ గంగిపాములు శ్రీరామచంద్ర
యోగీంద్రులవారు

శ్రీరామచంద్ర యోగీంద్రులవారి ప్రియశిష్యుడు



గ్రంధకర్త

పొన్నాల వెంకటేశ్వరరావు

# అచలసాధన సోపానము

## విద్య - గురువు

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేన్నమః

ప్రపంచమందు గురువు యొక్క ఆవశ్యకత ప్రతి యుగమునందును అత్యంతఉన్నత స్థానమందున్నది. లోకమందు 64 అరువది నాలుగు విద్యలు గలవు. అందు ప్రతి విద్యను ఆవిద్యలో ఆరితేరినగురువు ద్వారానే విద్యాభ్యాసం చేయవలెను. ఒక్కొక్కరు ఒకవిద్యను దానికి సంబంధించిన కొన్ని ఆధారములతో గురువు లేకనే తమంతట తాము విద్యాభ్యాసము చేయుదురు. అంతట ఆ విద్యలో ఆరితేరినామని వారు గర్వించుట గూడగలదు. తిరిగి వారు అదే విద్యను తగిన గురువు వద్ద ప్రారంభించినపుడు వారికి అంతకుముందు కలిగిన విద్యానుభవములు చాల చిన్నదిగా కనబడును కనుక గురువు లేకుండా నేర్చుకొనిన విద్యను మిడిమిడి జ్ఞానమని అందురు. అందుచేతనే "గురువు లేని విద్య గుడ్డి విద్య" అను సూక్తి కలిగినది.

పై జెప్పిన అరువది నాలుగు విద్యలు లోకసంబంధమయినవి. అనగా ఈ విద్యలు ఈలోకములో ప్రదర్శించుటకేగాని ముక్తి మోక్షములకు పనికిరావు.

౬౬వ విద్య బ్రహ్మవిద్య. అది భక్తికిసంబంధి
ఈ విద్యకు కూడా గురువు కావలెను.

భక్తి అనగా ఎవరియిలవేల్పులను వారికి భ
వశ్యములతో పూజించెదరు. దేవుళ్ళ పూజా విధానవ
పుస్తకరూపములో కొన్ని మంత్రములు కొన్ని నామ
దండకములతో ప్రచురించబడెను. కొందరు ఆ పుస్త
ఆధారముతో పూజలు చేయుదురు మరి కొందరు పుర
లను నియమించుకొని పూజలు వ్రతములు, యజ్ఞ
యాగములు మొదలైనవి చేయుదురు. అయినను
కూడా మిడిమిడి జ్ఞానమే యగును. ఏలయన గురువు
విద్య గుడ్డి విద్య అని తెలిసి కొంటిమి గదా!

బ్రహ్మ విద్య జన్మరాహిత్యమును జెందించును
పేరిట అనేక విధములయిన గురువు లుందురు. ఎ
ఎవరునేర్చిన విద్యలో వారు ఆరితేరి ( సిద్ధిపొంది )
క్రింది విధముగా వారి శిష్యులకు బోధించెదరు.

కొందరు పురాణములను, ఉపనిషత్తులను
దాని అర్థము చెప్పుచు ఆచార వ్యవహారములను చెపి
రీతిగా నడుచుకొమ్మని చెప్పెదరు. కొందరు యోగాస
లను చెప్పును. కొందరు అణిమాది అష్టసిద్ధులను అభ్య
జేయుదురు. కొందరు వ శీ క ర ణ మంత్ర తంత్రము
చెప్పును.

మరి కొందరు ఖేచరి, భూచరి, మధ్యమ షణ్ముఖి, శాంభవి అను పంచముద్రల నభ్యసింప జేయుదురు కొందరు తారక సాంఖ్య అమనస్క యోగములను చెప్పెదరు. కొందరు ఓంకారము నందలి చిలి, చీణి, ఘంట శంఖ, వేణు, వీణ, భేరి, మృదంగ మేఘ అను దశవిధ నాదములను వినిపించును. ఈ నాదములను సంగీత శాస్త్రములో అనాహత నాదములందురు.

కొందరు స్వరచింతామణిని అభ్యసింప జేసి భూత భవిష్యత్ వర్తమాన కాలములను తెలుసుకొనునట్లు జేయును. కొందరు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ ,ప్రత్యాహార, ధ్యానధారణ, సమాధి అను అష్టాంగ యోగములను చెప్పును. ఈ విధముగ వేర్వేరు గురువులు వేర్వేరు విషయములను బోధించును.ఇవన్నియు తిరిగి జన్మించుటకే గాని జన్మరాహిత్యమునకు పనికిరావు వారి జ్ఞానమంతటిదే అనగా పెద్దలను నిందించుట కాదు కాని ఎవరి అనుభవము వారిది సప్త మహాఋషులలో ఎవరైనను లోక సంబంధమయిన 33 కోట్ల దేవతల గురించియే తెలుసుకొని ప్రచారము చేసిరి కాని సాందీపమహర్షి లోకాతీతమయిన మతాతీతమయిన అచల సాంప్రదాయుడు ఆయన శిష్యుడు అయిన శ్రీ కృష్ణునకు అచలమును బోధించినాడు అచల సాంప్రదాయులు "గురుర్ బ్రహ్మ గురుర్విష్ణు" అను శ్లోకముమొదలు

కొని నిజస్థితని దెల్పి ఇహపరాతీతమును బోధిం
అటువంటి గురువే జన్మరాహిత్య మార్గ సాధనకు
యిన గురువు. ఉదాహరణ : శ్రీరాముని గురువు వశి
విశ్వామిత్రుని వలన కూడా శ్రీరాముడు కొన్ని అస్త్ర
విద్యలు నేర్చుకున్నను ఆయనకు మరల జన్మ కలి
ఆ విధముగ మరల జన్మ కలదని తెలుసుకున్నవాడై
మంది భక్తులకు కొన్ని కోరికలు ఈ జన్మలో తనకు
భంగము కనుక వచ్చేజన్మలో తీర్చెదనని చెప్పియున్నా
శ్రీకృష్ణునికితనగురువువలనఅహంరహితముచెందినందు
తనకుజన్మ రాహిత్యమున్నదనితెలియును కనుకనేశ్రీకృ
ఎన్నడును ఎవ్వరికినివచ్చే జన్మలో మీకోరికలు తీర్చె
చెప్పలేదు.

దీనిని బట్టి త్రేతాయుగములో శ్రీరాముడు
లైన వారికిని ద్వాపరయుగములో శ్రీ కృష్ణుడు మొద
వారికిని గురువులున్నట్లు తెలియుచున్నది. ద్వాపర
ములోకౌరవపాండవులకుద్రోణాచార్యులువిలువిద్యమొద
యుద్ధవిద్యలునేర్పెడిగురువు.ఇట్లే ప్రతివిద్యకు గురువుకా
యుండుననియు భక్తి మార్గమునకు ప్రతి యుగ
నందును గురువు లేనిదే యెవ్వరును యే విద్యను
సింప లేదని తెలియుచున్నది. కాని ఏ శిష్యుడైనను
నేర్చుకొను చున్నపుడు, తన గురువుయందు త్రిక
శుద్ధి గలిగిన భక్తి శ్రద్ధలతో ఉన్నపుడే పరిపూర్ణ విద్య
సాధించగలడు.

పెద్దలు భక్తిమార్గములో గురువులను 8 రకములుగా విభజించిరి.

1. బోధక గురువు : ఈయన శబ్దార్ధములను మాత్రము చెప్పును.
2. వేదక గురువు : తత్వమును తెలియ జెప్పును.
3. నిషిద్ధ గురువు : వశీకరణ మంత్ర తంత్రములను జెప్పును.
4. కామ్య గురువు : పుణ్య కర్మలను చేయించును.
5. సూచక గురువు : శాస్త్ర సమ్మతమయిన శమ దమాదులను బోధించును.
6. వాచక గురువు : భక్తి, జ్ఞాన, వైరాగ్యములను, బోధించును.
7. కారణ గురువు : అహం, బ్రహ్మాస్మి, అనెడి అమనస్క రాజయోగమైన శివజీవైక్య సంధానమును బోధించును.
8. విహిత గురువు : ద్వైవాతీతమగు అహంకార రహితమయిన తానులేని విచారణ జరిపించి జన్మరాహిత్య మార్గమును

బోధించును. దాని వలన కండ్లతో చూచునట్టిన్ని చెవులతో వినునట్టిన్ని మొదలగు ఇరువది నాలుగు ఇంద్రియములును ఇరువది అయిదవ ఇంద్రియమైన చైతన్యమనే జ్ఞాతతోసహా సున్నయనిన్ని ఒకటి గాక రెండు గాక సున్న

కతీతమై యున్న నీ యదార్థ స్వరూప మొకటు సందేహము లేక అహంకారము లేని స్థితియందు దృ యముగా స్థిరపడును. అంతట హృదయ గ్రంధి తర బాహ్యేంద్రియములు జ్ఞాతతో సహా తన యందు కనబడకుండును.

భక్తి విషయములో అన్ని మార్గములకు అని ముల వారికి తిరిగి జన్మించుటే గలదు. కాని అచల సంపత్తి వల్లనే జన్మరాహిత్య మార్గమున్నట్లు పెద్ద ప్రాయము అందుచేతనే దీనిని అహంరహిత మార్గ పరిపూర్ణమనియు, అచలమనియు చెప్పుదురు. కను లందరు వారున్న మార్గములోని సత్యా సత్య ఒకరి ప్రమేయము లేకుండా నిదానముతో అ గ్రహించవలెను. ఏ మతములోను అహమును నిరూ ార్గము లేదు. ఈ విషయమును యెవ్వరైనను గ లిగినప్పుడే అచలము యొక్క విశిష్టత బోధ ట్లు బోధపడిన వారు విహిత గురువు అనే అచల గ ెదకి వారి వద్ద ఉపదేశమును పొంది వారికి నాల్గు వి ుయిన సేవలతో సుశ్రూషచేసివారి కరుణా కటాక్ష ములతో తమ నిజస్థితిని తెలుసుకొని తరించెదరు. జన్మరాహిత్యమును జెందెదరు.

# అచలసాధన సోపానము
## 2 సృష్టి - అనిత్యము

సృష్టిని గురించి ముందుగా భగవద్గీతలోని సాంఖ్య యోగమందు 28వ శ్లోకము.

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని - వ్యక్తమధ్యాని భారత
అవ్యక్త నిధనాన్యేవ - తత్రకాపరి దేవనా?

తా॥ సర్వభూతములు ఏదో ఒక అగోచర పదార్థమునుండి ఉదయించి నడుమనిట్లు కాన్పించుచున్నవి. తుదకా అగోచరపదార్థమునందే అవి అన్ని యులయించును. కాబట్టి అందులకు విచారమెందులకు.

అనగా సృష్టి అనిత్యము. జీవసృష్టి అంతయు ఓంకారము నుండి జనించిన పంచభూతముల సమ్మేళనము. అనగా ఆకాశము, అగ్ని, జలము, వాయువు, భూమి. ఈ పంచ భూతముల మిళితము వల్లనే జీవసృష్టి జరుగుచున్నది. మరియు లయమగుచున్నది. అనగా నాశనమగుచున్నది. పుట్టిన ప్రతిజీవి మరణించును. మరియు తయారైన ప్రతి వస్తువు నాశనమగుట తప్పదు. అందుచేత సృష్టిఅనిత్యము.

అద్భుతము ఆశ్చర్యము అమోఘము విచిత్రము భయానకము విషాదము సంతోషము మొదలైన నవరస ములు, దారేషణ, ధనేషణ, పుత్రేషణ అను ఈషణత్రయము సత్వరజః తమోగుణములనే త్రిగుణములు, 33కోట్ల దేవతలు

7 కోట్ల మంత్రములు అష్టదిక్పాలకులు నవగ్రహః లు 27
నక్షత్రములు మొదలైన వన్నియు సృష్టి ప్ర వము
వల్ల నే కలిగినవి.

సృష్టి అనగా లేని మాయ అదే యెరుక, కృతి,
ప్రపంచము. నేను, అనే అహం దీని ప్రభావమే. కృతి
పులకిస్తే ఆనందోత్సాహములు పెల్లుబుకును. అది లయ
తాండవ మాడితే భయాందోళనము, విషాదము పె ల్లును.
సృష్టికి 84 లక్షల జీవరాసులను పుట్టించి పెంచి నశింప
జేయు శక్తిగలదు. దీని ప్రభావము వల్లనే సంకల కల్ప
ములు జనన మరణములు, సుఖ దుఃఖములు, ఋణ రము,
ఋణ విముక్తి పుత్ర సంతానము సంతాన విహీనము జ్ఞానా
జ్ఞానములు వివేకా వివేకములు, అదృష్ట దుర దృ ములు
అనుద్వంధములున్నూ, చతుర్వేదములు, అష్టాదశ రాణ
ములు ఉపనిషత్తులు, రామాయణ భారత భాగవ ములు,
బైబిలు ఖురాన్ వంటి గ్రంధములు కలిగినవి. అం వల్లనే
దీనిని మాయా ప్రపంచమందురు. ఈ మాయా పంచ
మందు జరిగెడి ప్రతి విషయము మాయాగానే కన పను.
ఈ మాయా ప్రభావము చేతనే లేని దానిని ఉన్న ఉన్న
దానిని లేనట్లు చేయగల మాయాజాలము జరుగు ది.
కనుక, ఈమాయా ప్రపంచములోని మానవులందర మహి
ములు పొందుటకు అవకాశము గలదు. ఇందుకుదాహ ణము

విశ్వామిత్రుడు తన తపోశక్తి చేత సృష్టికి ప్రతి సృష్టి చేయగలుగుట, (2) భూత భవిష్యత్ వర్తమాన కాలములు చెప్పగలుగుట ఉ:- వాల్మీకి యవ్వనమునందు బోయవాడైనను దుర్మార్గుడైనను భవిష్యత్‌లో జరుగు రామాయణమును రచించి ప్రఖ్యాతిగాంచినాడు, (3) నవఖండ యోగము ఉ:- జరా సంధుడు తన శరీరమును రెండు ముక్కలుగా చీల్చినను తిరిగి అతికించుకొను శక్తి కలిగెను అదియును గాక కొత్తలంక వాస్తవ్యుడు కొత్తలంక యోగి అనునతడు, తన శరీరమును ముక్కలుగా చేసుకొని ఈ నవఖండ యోగముచే తిరిగి అతికించుకొన గలిగెనని వినికిడి (4) పరకాయ ప్రవేశము అనగా ఒకడు జీవించి యుండగనే తన శరీరములోని సూక్ష్మ శరీరము ( అనగా జీవిని ) వేరొక మరణించిన వాని శరీరములో ప్రవేశింప జేసి ఆశరీరముతో కొంతకాలము గడిపి మరల తిరిగి తన స్వశరీరములో ప్రవేశించి లేచుట. ఈ విద్యను విక్రమార్కుడు, శంకరాచార్యులు అభ్యసించి చూపినట్లు తెలియుచున్నది. మరియు మద్రాసులోని థియొసాఫికల్ సొసైటి స్థాపకులు అయిన కీర్తిశేషులు శ్రీ జిడ్డు కృష్ణమూర్తి పరకాయ ప్రవేశమును అభ్యసించినట్లు తెలియుచున్నది. (5) ప్రాణాయామము అనగా శ్వాస నిశ్వాసలను క్రమపరచి, రేచక పూరక, కుంభక అను అభ్యాసములతో శ్వాసను బిగించి కొంత

కాలము లేక కొన్ని సంవత్సరములు ఉండుట. ఇందు మూడు రకములు 1) వాయు స్థంభన 2) జలస్థంభన 3) అగ్ని స్థంభన. వాయు స్థంభన ముందు చెప్పబడినది. జల స్థంభన అనగా నీటి లోపల కొంతకాలము ఉండుట. ఉదా:- కురుక్షేత్రయుద్ధ సమయమున దుర్యోధనుడు నీటిలో మునిగి దాగెను. అగ్ని స్థంభన అనగా అగ్నిలో ప్రవేశించినను కాలిపోకుండా ఉండుట.

6) దూర శ్రవణము అనగా దూరముగా వున్నవారి మాటలు, శబ్ధములు ఉన్నచోట నుండియే విన గలుగుట. ప్రస్తుత ఆధునిక యంత్రము రేడియోవలె శరీరమును విని యోగించుట. దూర దృష్టి అనగా ఉన్నచోట నుండియే దూరముగా వున్నవారిని చూచుట. ఆధునిక యంత్రము టెలివిజన్ మాదిరి శరీరమును వినియోగించుట 7) దివ్య దృష్టి అనగా భూత, భవిష్యత్, వర్తమాన కాలములను ఒక చూపుతోనే చూచి తెలుసుకొనుట. 8) ఒకచోట కనిపించి మాయమై మరియొక చోట కనిపించుట. 9) అక్షయము అనగా ధన, కనక, వస్తు, వాహములు ఎంత విరివిగా ఉపయోగించినను ధనమును, ఖర్చుచేసినను తరుగకుండా అధికమగుట. 10) స్వరచింతామణి అనగా ముక్కు రంధ్రముల ద్వారా వచ్చు శ్వాసను కుడి, యెడమలను (ఇడ పింగళ) ఉపయోగించుచు అభ్యాసము చేసి భూత భవిష్యత్ వర్త

మాన కాలములను తెలుసుకొనుట. 11) ఛాయా పురుషలక్షణము అనగా తన నీడను తదేక దృష్టితో చూచి వెంటనే ఆకాశములోనికి (మబ్బులు లేని ప్రదేశములో) చూచి గాని లేక కళ్ళు మూసుకుని గాని చూడవచ్చును. అపుడు తన నీడ ఆకాశములో పెద్దది గాను కళ్ళు మూసుకున్నపుడు చిన్నది గాను కనబడును. ఆ విధముగా చూచి, తన మరణ సూచనలు తెలుసుకొనెదరు. పైన చెప్పిన వన్నియు ఆయా విద్యలను సాధన జేసి ఆరితేరిన వారి నాశ్రయించి వారి ద్వారా అభ్యాసము జేసి దీక్షతో కృషి చేసిన యెడల పై వాటిలో దేనినైనను యెవ్వరైనను సాధించ గలరు. ఇటు వంటి విచిత్రములలో కొన్ని వీరబ్రహ్మేంద్ర స్వాములవారు కూడా చూపి భవిష్యత్తును కూడా కాలజ్ఞానములో చెప్పినారు. కాలజ్ఞానము మహాభారతములో మార్కండేయులు చెప్పినారు.

అందుచేత మానవ శరీరమనగా ఒక మహాలోకము. ఆలోకములో పై జెప్పిన విద్యలన్నీ అభ్యసించుటకు అన్ని పరికరములు శరీరమున గలవు. అందు ప్రతి పరికరము అనుభవమున్న గురువర్యుల చేతనే కదలింపబడవలెను. కాని ఈ యోగములు అభ్యసించిన మానవులకు మహాత్ముల నిపించుకొను భాగ్యము కలుగును. అందువలన అహంప్రబలును అహంవలన పుట్టుచూ చచ్చుచూ వుందురే కాని జన్మ

రాహిత్యము మాత్రము కలుగదు. వీరిజన్మ సూన్యము.

జన్మ రాహిత్యమనగా జీవితకాలము గడచి మరణిం చిన తర్వాత ఆజీవి తిరిగి యేశరీరమందును ప్రవేశించి జన్మించ కుండుట. పై విద్యల నభ్యసించిన ఎంతటి మహా త్ములకైనను ఈ జన్మ రాహిత్యము సాధించుట దుర్లభము ఒక అచల గురువుయొక్క కరుణా కటాక్షము వల్లనే సాధ్యము.

ప్రకృతి మాయ, అనిత్యము క్షణికము అయినన అది శృంగార మందిరముగాను, నరక కూపముగాను స్వ ములెను రకరకములుగా ఒక్కొక్కరికి ఒక్కొక్క విధ ముగా వారి స్థితినను సరించి కనబడును.

మానవుడు తనకు గల వన్నియు తనవేనని తలచున అందుచేత నా యిల్లు, నా ఆస్తి, నా వస్తువు, నా భార్య నాభర్త, నా కుమారుడు, నాకుమార్తె, నా తండ్రి, నాతల్లి నా మనుమడు, నా మనుమరాలు, నా అత్త, నామామ, న కోడలు, నా అల్లుడు, అని తన వారిని చూచి ఆనందించును విరోధులను చూచి కోపించును. పుట్టిన వారిని చూచి ఆన దించును. తన వారు చనిపోయిన యెడల వారిని చూ యేడ్చుచుందురు. ఈ సంబంధ బాంధవ్యము లన్నియు ఋణప్రాప్తి వల్లనే సంభవించును. ఋణముతీరగనే ఒకరి నొకరికిసంబంధము వీడును. అప్పుడు ఆయుష్న్న వా

)రోధముతో గాని మరే విధముగా గాని దూరమవుదురు. ఆయువు లేని వారు చనిపోవుదురు.

పుట్టిన ప్రతి జీవికి క్షణక్షణమునకు మృత్యువుండును. ) క్షణమునైనను చనిపోవచ్చును. ఈ రోజున్న వారు రేపు రేక పోవచ్చును. అనగా చావు. ఈ రోజు లేని వారు రేపు రావచ్చును. అనగా పుట్టుక. ఈ రెండూ తప్పని సరిగనుక శ్రీలికగా తీసుకొనవచ్చును.

భగవద్గీత సాంఖ్య యోగమున 27వ శ్లోకము.

శ్లో॥ జాతస్యహిధృవో మృత్యు-ర్ధ్రువం జన్మ మృతస్యచ
తస్మాద పరిహార్యేఽర్థే-నత్వ శోచితు మర్హసి॥

తా॥ పుట్టిన వానికి మరణము తప్పదు. మరణించిన వానికి బుట్టుకయు తప్పదు. కావున తప్పింప శక్యముగాని ఈ విషయమునందు నీవు మొదటే విచారించ కూడ దని అర్జునునికి శ్రీ కృష్ణుడు దెల్పెను.

మానవుడు తాను సంకల్పించిన ప్రతి విషయము సక్రమముగా జరిగిన యెడల అది తన ప్రభావమేనని గర్వపడును. అట్లు జరగక పోయిన యెడల మరల మరల ప్రయత్నించును. ఎన్ని సార్లు ప్రయతించినను జరుగక పోయినయెడల ఇది దైవసంకల్పమనియు, విధియనియు కొందరు అనుకొనుచుందురు.

ప్రతి మానవునకు ఎప్పుడు ఎక్కడ ఏది ఎట్లు జరగవలెనని యుండునో అట్లు జరుగక మానదు. "జరుగ నున్నది. జరుగక మానదు" అని పెద్దలనుట గలదు. అయి నప్పటికిని ప్రతిమానవుడు ప్రతిపనియందు ప్రయత్నము కృషి ఎక్కువగా చేయవలెను. సోమరి తనముగా నుండ కూడదు. ఆపై ప్రతి ఫలితము తన వల్లే జరిగినదని భావిం చకూడదు.

మనము నిద్రించునపుడు స్వప్నము వచ్చి అనేక మయిన చిత్రవిచిత్రములను, మంచి చెడులను చూచెదము. కొందరు మెలకువ వచ్చిన తర్వాత ఇది కలయని తెలుసు కొందురు. కొందరు స్వప్నములోనే చిరుమెలకువ గలిగి ఇది కలయే గదా! అనేభావముతోనే కలగంటూ వుందురు. అటు వంటివారికిఆకలలో ఎంతటి భయంకరమయినదృశ్యములు చూచినను మనసు చలించక భయపడక వుందురు. అసలు ఈ జగత్తే నిజమయిన కల నిద్రలో వచ్చుకలకు ఈ కలకు తేడా లేదు. ఈ కలలో అనగా ఈ ప్రపంచములో అనేక మందిని కలుసుకుని అనేక కష్ట సుఖములను పొంది ఇది కలయే అని తెలుసుకొన కుండానే మరణము పొంది వెళ్ళి పోవుచున్నారు.

మనకు నిద్రలో వచ్చిన కలలో "ఇది కలయే గదా" అనే భావమున్న వారివలెనే మెలకువలో కూడా ఈ ప్రపం

వములో జరిగెడి ధంతయు నిజమైన కలయని త్రికరణ శుద్ధిగా గుర్తించిన వారికి ఇందలి కష్టసుఖములు, చావు పుట్టు కలయొక్క ప్రభావము ఏమే మాత్రము కనబడదు. అటు వంటి వారికి తమ నిజస్థితిని తెలుసుకొనెడి అవకాశము కలు గును. అట్టి వారికే అహంరహితం చేసుకొనెడి జ్ఞానము కలు గును. వారికే అచల గురువుయొక్క ఉనికి దొరకును.

మానవులకు సహజముగా ఆహారము, నిద్ర, మైథునము, సంపాదన, ఆదరణ, ప్రేమ, శాంతము, అసూయ, ఈర్ష్య, కామ క్రోధ, మద, మాత్సర్యములు వుండును. కాని ఇవన్నియు మానవులలోనే కాక, పశువులకు, జంతువులకు, పక్షులకు, మరియు సమస్త జీవ కోటికిని గలవు. కాని భక్తి జ్ఞాన వైరాగ్యముల విషయములను తెలుకొను శక్తి, వాటికి అను వగు వసతులు మానవ శరీరమందే కలవు. దీనికి ముఖ్యమ యినది. తెలివి. ఈశరీరము యెపుడు నశించునో తెలియదు తిరిగి మానవ జన్మ వచ్చునని నమ్మకము లేదు. 84 లక్షల జీవరాసులలో యే జన్మ అయినా రావచ్చును. కాబట్టి ఇటు వంటి ఉత్కృష్టమయిన జన్మమును సార్ధకము చేసు కుని తన తెలివితో నిజగురుని సహాయమున తన యదార్ధ స్థితిని గ్రహించి జన్మరాహిత్యమును పొందవలెనని ఆతృత చెందవలెను.

ఇందు కొఱకు ముఖ్యముగా ఆరోగ్యమును బాగుగా యుంచుకొనవలెను. కనుకనే పూర్వము ఋషులు యోగాసనములను కనిపెట్టి అభ్యసించి ఆరోగ్యమును కాపాడుకుంటూ తపస్సు చేసుకొనెడి వారు మన యదార్ధ స్థితి మనకు తెలియు వరకు ఆరోగ్యమత్యంత అవసరము.

సర్వసాధారణముగా ఆరోగ్యమును కాపాడుకొనుటకు 4 ఆసనములు చాలును. అవి. పశ్చిమతానాసనము 2. సర్వాంగాసనము లేక శిరసాసనము, 3. మత్స్యాసనము 4. శవాసనము.

## 1. పశ్చిమ తానాసనము



చాపమీద కూర్చుని రెండుకాళ్ళను బాగుగా చాచి మోకాళ్ళు పైకెత్తకుండా ముందుకువంగి రెండు చేతులతో రెండు కాళ్ళ బొటన వేళ్లను పట్టుకొని శిరస్సును మోకాళ్లపై నుంచవలెను. గాలిని ముక్కుతోనే పీల్చవలెను.

ఈ అభ్యాసము చిన్నవారలకు, సన్నని వారలకు సులభ
ాధ్యము.వయసుముదిరిన వారికి,స్థూలముగా నుండువారికి
ంతకష్టము అయినను 20రోజుల వ్యవధిలోకుదురును.

ప్రయోజనములు: ఈఆసనమువల్లన ప్రాణవాయువునుపశ్చి
ుసుషుమ్న మార్గమ్ముగ పోవునట్లు చేయును. జఠరాగ్నిని
భివృద్ధి పరచును. స్త్రీ పురుషులకు ఉదరమునుతగ్గించును.
రీరమునకు మంచి యారోగ్యమును కలుగ జేయును.
రములకు బలము నిచ్చును. మలబద్ధమును పోగొట్టును.
ూలవ్యాధి మూత్రదోషములను నిర్మూలించును. మరియు
అనేక రోగములను హరించును.

## 2. సర్వాంగాసనము



ఇదియొక అద్భుతమ
యిన ఆసనము. దీని వలన
అద్భుతమైనశక్తి లభించును
ఈఆసనము వలన శరీరము
నందలి సకల అవయవము
లకును పరిశ్రమ చెందిం
చును అందుచేత సర్వాంగ
ములకును ప్రయోజనము
కలదు. కనుకనే సర్వాంగా
సనమందురు.

నేలపై దుప్పటి 4 మడ
తలతో వేసి దానిపై పరుండి,
రెండుకాళ్ళను పైకి ఎత్తుచు
పిరుదలు వీపు పైకెత్తి పట్టి

గడ్డము ఛాతీకి తగులునట్లు చేసి మోచేతుల సహాయమ
శరీరము యొక్క బరువునంతయు భుజముపై ఆధార
యుండునట్లు చేయవలెను. ఊపిరి సాధ్యమైనంత వ
బిగబెట్టవలెను. కష్టమైనపుడు మెల్లగ ముక్కుతో వ
చుండవలెను. దీనిని ఉదయం సాయంత్రం అభ్యసి
వచ్చును. దీనిని ఆచరించిన తర్వాత మత్స్యాసనమును
రించవలయునని శాస్త్రములు తెలుపుచున్నవి. ఈ ఆసన
అభ్యసించిన యెడల మెడ ప్రదేశములో కలుగు న
తగ్గి సర్వాంగాసనము వలన కలుగు ప్రయోజనమ
నభివృద్ధి పరచునని యోగీశ్వరుల అభిప్రాయము. ప్ర
భములో 2నిముషములతో ప్రారంభించి కనీసము 30ని
షములవరకు ఉండునట్లు అభ్యసించవలెను.

ప్రయోజనములు :- ఈ ఆసనమువలన కంఠ
శములలో నుండు ఒక ముఖ్యమయిన గ్రంధి అభి
చెంది బలపడుచుండును. ఆ గంధ్రి శరీరమునకు ఆర
మును, బలమును, శక్తిని కలుగజేయుటలో చాల మ
మైనది. ఈ గ్రంధి బలముగా నున్నచో శరీరమున
ప్రసరణము, ఊపిరితిత్తులు, జీర్ణకోశము, మర్మావ
ములు, నరములు, మొదలగునవి. అన్నియు శక్తి
ములై సక్రమముగా నుండును. శరీరమునందుండు
న్యాకములగు గ్రంధులన్నిటితోడను ఈగ్రంధి సంబం
గలిగియుండును. ఈ గ్రంధి సక్రమముగా నున్న

మిగిలిన గ్రంధులన్నియు సక్రమముగా వాటివాటి పనులను నేరవేర్చగులుగును. ఈ గ్రంధి బలహీనమైనచో శరీరము కృసించిపోవుటకు ప్రారంభమగును.

మొత్తము మీద ఈ ఆసనము ఆచరించిన శరీరారోగ్యము చెక్కుచెదరక యుండుటయే కాక విశేషశక్తియు పూర్ణాయుర్ధాయమును, కాయసిద్ధి, లభించును. వృద్ధాప్యము మాయమగును. స్త్రీలుకూడ దీని నభ్యసించవచ్చును. కుండలినీ శక్తిని లేపునని యోగశాస్త్రములు తెలుపుచున్నవి. జఠరాగ్నిని వృద్ధిపరచును. మలబద్ధమును దీర్ఘవ్యాధులను నిర్మూలించును. వేయేల మృత్యుదేవతనుదరికిరానీయుదు.

## 3. మత్స్యాసనము



నేలపై దుప్పటి పైమాదిరిగా పరచి దానిపై కూర్చుండి పద్మాసనము అనగా కుడిపాదము ఎడమతొడమీదకు ఎడమ పాదము కుడితొడమీదకు వచ్చునట్లు అమర్చికూర్చుని. తరువాత కాళ్ళుమాత్రము అట్లేవుంచి, వెనుకకు వాలి వీపు

నేలకు తగులునట్లు పరుండవలెను. చేతులతో పాదావుం
పట్టుకొనవలెను తలను వెనుకకు వంచవలెను. ఇట్లు 10
నులతో అభ్యాసము మొదలుపెట్టి క్రమముగా టైము పె
వలెను. అభ్యాసము పూర్తియైన తర్వాత శిరస్సును
ఎత్తి చేతులు సరిగా తీసుకొని లేచి కూర్చుని కాళ్ళ
మును విప్పవలెను. ఈ ఆసనము ఊపిరితిత్తులకు బలము
కలుగజేసి వానికి సంబంధించిన రోగములను అనగా ఉ
సము, క్షయ, మొదలగు దీర్ఘవ్యాధులను నిర్మూలించు
శరీరమునందలి గ్రంధులన్నియు సరిగా పని చేయుగ
జేయును.



## 4. శీర్షాసనము

నేలపై దుప్పటి పరిచి శిరసు
క్రిందిగా నుంచి పాదములను పైకి వ
నట్లు చేయుటవలన కపాలాసనము
వృక్షాసనమని, కూడ దీనిని పిలుతురు

గోడ దగ్గరకు 4మడతల దుం
పరచి దానిపై గోడవైపుగా మో
మీద కూర్చుని రెండుచేతుల వేళ
కలిపి మోచేతులు మోకాళ్ల దగ్గర
కాళ్లను పైకెత్తవలెను. రెండు చే
మధ్యకు శిరస్సును ఉంచి కాళ్లను
గాపైకిలేపిచాపవలెను. ముందుగా
కాళ్లను గోడకు ఆనించవచ్చును.

ముగా కాళ్లను గోడనుండి తప్పించి శరీరమంతయు శిర
స్సుపై ఆధారపడునట్లు చేయవలెను. ప్రారంభములో ఈ
విధముగా 5 సెకనులు మాత్రమే అభ్యసించి క్రమముగా
అభ్యాసకాలమును పెంచవలెను. దరిదాపు 30 నిముషము
లుంచిన చాలును. ఉదరమున ఆహారమేమియు లేనప్పుడే
ఈ ఆసనమును ఆచరించవలెను.

ప్రారంభమున తల తిరుగుట శరీరము తిరిగినట్లుగా
నుండుట మొదలగు అవలక్షణములు ఉండినను క్రమముగా
అవన్నియు తగ్గి హృదయమున ఆనందమును శరీరమున
సౌఖ్యము కలుగును. వేసవికాలములో ఈ ఆసనమును అభ్య
సింపరాదు - శీతాకాలము వర్షాకాలములలో దీనిని అభ్య
సింపవలెను. వేసవియందు స్వల్పముగా అభ్యసింపవచ్చు
నని అనుభవజ్ఞులు తెలుపుచున్నారు. దీనిని అభ్యసించు
నప్పుడు గాలిని నోటితో పీల్చరాదు, విడువరాదు. అభ్యా
సము తరువాత సుమారు 5 నిముషములు విశ్రాంతి తీసు
కోవలెను. తరువాత కొంచెం పాలను సేవించవలెను.

ప్రయోజనములు :- బ్రహ్మచర్యమును అవలంబిం
చుటకు యీ ఆసనము అత్యంత అనుకూలము. జ్ఞాపకశక్తి
వృద్ధియగును. న్యాయవాదులు, శాస్త్రవేత్తలు, విద్యావం
తులు మొదలగు వారికి యీ ఆసనము విశేష ప్రయోజన
కారిగా నుండును. స్వతస్సిద్ధముగా దీనివలన సమాధియు,

ప్రాణాయామము లభించును. ఈ ఆసనమును ప్రతిదిః
మును అభ్యసించు వారలకు హృదయమున ఒకవిధమయిః
ఆనందము, ముఖమున తేజస్సును ప్రారంభమగును.
అభ్యాసానంతరము ధ్యానమునకు కూర్చుండినచో విశేః
ప్రయోజనము కలుగును. మనస్సు నిశ్చలముగ నుండున
ముఖ్యముగ ప్రస్తుత కాలమందు గల రక్తపోటువ్యాధి
నయమగును. దుష్ట రక్తమును శుభ్రపరచును. శీర్షా
సము అభ్యాసకాలమందు స్త్రీ సంపర్కము చేయరాదు.

నేత్ర రోగములు, నాసికా రోగములు, శిరోవ్యాధుల
అజీర్ణవ్యాధులు, మర్మాంగములకు సంబంధించిన వ్యాధుల
వేయేల సమస్త రోగములు నశించును. శరీరము ముడతల
పడుట, వెంట్రుకలు తెల్లబడుట, బద్ధకము, నీరసమ
మొదలగునవి అదృశ్యములగును. సుమారు 3 గంట
కాలము యీ అభ్యాసము చేయగలిగిన వాడు యోగి అ
పిలువబడును. పురుషులకు సకల విధములయిన శుక్లదో
ములు హరించును. సంతానము కలుగును. ఈ ఆసనముః
సకల శాస్త్రములు విశేషముగా కీర్తించుచున్నవని తెలియ
చున్నవి.

## 5. శవాసనము



ఆసనములు వేయుట ప్రారంభించినప్పటి నుండి అన్ని ఆసనములు పూర్తి అగునప్పటికి ఎంతటైము పట్టినదో అంతటైమును ఈ ఆసనమునకు తీసుకొనవలెను. - చాపమీద వెల్లకిలా కాళ్ళు, చేతులు, చాపుకొని విశ్రాంతిగా పడుకొనుటయే శవాసనమందురు. ఈ ఆసనము వేయునపుడు మనస్సు ప్రశాంతముగా ఉంచుకొనవలెను. ఆందోళనగాని, తొందరపాటుగాని, ఉండకూడదు. ఇదిపూర్తి అయిన తర్వాత పళ్లరసమును సేవించవలెను. కాఫీ, టీలు, సేవించరాదు. ప్రతిరోజు ఈ ఆసనమును ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం, 30 నిముషముల చొప్పున వేసిన యెడల వారమురోజులలో గుండెపోటు, రోగము సర్దుకొనును.

ఆసనములు అన్నియు వేసిన తర్వాత అంతమునందు ఈ ఆసనము వేయనిచో ముందువేసిన ఆసనములు ఫలితము లీయవు.

పై జెప్పిన ఆసనములేకాక ప్రతి నాలుగు, నె
ఒకసారి విరేచనములు అగుటకును, 6 నెలలకు ఒ
వాంతులు అగుటకు మందులు వాడవలెను. విరేచనః
అగుటకు (1) ఫిబ్రవరి నెలలోను (2) జూన్ నెల
(3) అక్టోబరు నెలలోను వేసుకొనుట వలన శరీరవ
మేలుజరుగును. వాంతులకు ఫిబ్రవరి నెలలోను జూన్
లోను 2 గ్లాసుల వేడినీళ్ళలో మామూలు ఉప్పు క
ఎక్కువగా కలుపుకొని ఉదయం ఒకేసారి తీసుకొనిన
జరుగును. దీనివలన ప్రమాదము ఉండదు. దీనిలో ఏ
ఆచరించినా ఆ రోజునుండి 3 రోజులు చప్పిడి అనగా
పులుసు, కారము లేకుండా భోజనము చేసిన చాలా
చేయును. ఇందువలన శరీరము ఆరోగ్యముగా
మనస్సు ప్రశాంతముగా నుండును.

ముఖ్యముగా శాంతమును ఎక్కువ అలవాటు
కొనవలెను. శాంతము లేని వారికి సుఖము సౌఖ్య
వుండవు. మనస్సు ప్రశాంతములేని యెడల బ్రహ్మ
సాధించుట కష్టము.

# అచలసాధన సోపానము

## 3. పూర్వజన్మ కర్మఫలము

ప్రతి మానవుడు మరియు ప్రతి జీవియు ఈ జన్మములో అనుభవించుచున్న సుఖదుఃఖములు పూర్వ జన్మము నందు అహముతో చేసుకున్న పాపపుణ్యముల ప్రభావమే "పూర్వ జన్మ కర్మ ఫలము లేక విధివ్రాత అందురు. దీనికి నిదర్శనం పుట్టిన ప్రతిజీవికి తన జీవితములో అనేకమయిన మంచి చెడులు కష్టసుఖములు సంభవించును. అవి అందరికి ఒకే విధముగా నుండక వేర్వేరు విధములుగా నుండును. అదే ఎవడుచేసిన పూర్వ జన్మ కర్మ యొక్కఫలము వారనుభవించుట.

ఈ క్రింది విధములను పరిశీలించి గమనించుడు

1) ఈ జన్మలో అతిమంచివారైనను ఒకరి సొమ్మును ఆశించక వారి కష్టముతోనే వారి బ్రతుకును సాగించుకొనుచు కొందరు ఎన్నో కష్టములు పొలగుచున్నారు. 2) పుట్టుకతోనే ఐశ్వర్యవంతులై భోగభాగ్యములతో తులతూగుతూ ఉందురు. వారిలో కొందరు దుష్టస్వభావులై ఎన్నో లోకవిరోధములయిన పనులు చేయుచు ఆనందముతో కాలము వెళ్ళబుచ్చుచున్నారు. వీరిలో కొందరు మంచి స్వభావులై అణకువతో మంచి పనులు, పూజలు, వ్రతములు, యజ్ఞయాగాదులు, దానధర్మాలు, చేయుచు ఆనందముతో కాలము

వెళ్ళుబుచ్చుచున్నారు. పుట్టుకతోనే దరిద్రులై కొంతకాల
తరువాత కొందరు కుయుక్తులతో ఇతరులసొమ్మును దో
కొనియు, కొన్ని దారుణములు చేసియు, ఐశ్వర్యవంతు
ఆనందముగా కాలము గడుపుచున్నారు. వీరిలో కొం
ఎంత దరిద్రులుగా వున్నప్పటికిని నీతి నియమముల
పాటించుచు దరిద్రమునకు భయపడక ఐశ్వర్యము కో
లోభపడక జీవితాంతము దరిద్రములోనే ఆనందము
కాలము గడుపుచున్నారు. 4) పుట్టుకతోనే ఐశ్వర్యవ
లైనప్పటికి, బాల్యములోనో, యవ్వనములోనో, నడివ
స్సులోనో, వృద్ధాప్యములోనో, కొందరు అనాఆరోగ్య
తులై వారికి యిష్టమయిన ఆహారము తీసుకొనలేని నిక
జీవనము గడుపుచున్నారు. 5) కొందరు దైవభక్తులు,
కారులు, కవులు, నీతి నియమములను పాటించుచు దర
ముతో నికృష్టజీవనము గడుపునున్నారు. వీరిలో కొం
వున్నత స్థానములోవుండి పేరు ప్రఖ్యాతులతోను, ఐశ్వ
నందముతోను జీవించుచున్నారు.

6) పూర్వపురాజులలో కొందరు రాజ్యమేలుచు ప్ర
లను బాధించి చిత్రహింసలు పెట్టి తమఖజానాలను ని
కొనుచు కేళీవిలాసములతో తేలియాడిరి. ప్రస్తుత ప
పాలనా వ్యవస్థలో కూడా కొంత మందికి, పదవులు
ముందు గల ఆస్తికి పదవులుపొందిన తర్వాత గల ఆ
ఉన్నతేడా కూడా గమనించదగును.

7) కొందరు విద్యలేకపోయినా కేవలం వేలిముద్ర వేయువారుగూడ వ్యాపారములోగాని, పదవులలోగాని, హెచ్చుగా రాణించుచున్నారు. ఈవిధముగా చెప్పుకుపోతే ఒక పెద్ద గ్రంధము తయారగును. కనుక పై విధములను గమనించిన లోకములోగలవారంతా ఒకరికొకరికిసంబంధము లేకుండా వేరువేరు విధములుగా జీవించుచున్నారని తెలియుచున్నది. అదే పూర్వ జన్మ కర్మ ఫలమునకు ప్రత్యేకమయిన నిదర్శనం.

ఈపూర్వ జన్మ కర్మ ఫలము నిజముగా లేనట్లయితే ప్రతి జీవికి పుట్టుక చావులందును, సుఖదుఃఖములందును ఒకే విధముగావుండాలి. అలాకాక వివిధరూపములుగా ఉన్నవారి ప్రవర్తన, జీవనము, సుఖదుఃఖములకు కారణము పూర్వ జన్మ కర్మ ఫలమే.

ప్రతివారి ఆయువుకూడా వారివారి పూర్వ జన్మ కర్మ ఫలము పూర్తిగా అనుభవించుటకు తగినవిధముగా కాలము నిర్ణయింపబడి యుండును. ఇది ప్రకృతి మాయాజాలము.

ఈ పూర్వ జన్మ కర్మ ఫలముగాని, ఈ జన్మ కర్మ ఫలము గాని అహమువలన సంభవించును. లోకములో అహములేని జీవిలేదు. అహములేనిదే చైతన్యములేదు, చైతన్యములేనిదే జీవనములేదు. ఇది ప్రకృతియొక్క సహజగుణము.

అందుచేత ప్రతిమానవుడు మంచి చేసినా చెడు చేసినా అహముతోనే చేయును. అహమనగా బేటరీ లేక విద్యుత్

శక్తివంటిది. ఆ అహముయొక్క శక్తివలనే తాను చేసిన మంచి చెడులను ఆత్మయందు నమోదు ( రికార్డు ) చేయబడును. కానిదేవుడెక్కడోవుండి నీపాపపుణ్యములకులెక్కలు తయారుచేసి వాని ఫలితములను నిర్ణయించి పునర్జన్మయందు ప్రకటించుట మాత్రముకాదు.

పూర్వులు యజ్ఞయాగాదులు సత్ఫలితముల కొఱకు కల్పించినారు. యజ్ఞయాగాదులుచేయువారు. ఒకకోరిక కొరకు నేనుచేయుచున్నాను అనే అహముతో చేయుదురు. అందుచేత ఆయజ్ఞఫలము వారి ఆత్మయందు నమోదు చేయబడును. దీనిలో వివిధరకములు గలవు. అనగా ఒకేయజ్ఞము నలుగురు వేర్వేరుగా చేయుచున్నపుడు వారి యందుగల భక్తిశ్రద్ధల వ్యత్యాసములను బట్టివాటిఫలితములు వేరువేరుగా వారుపొందుదురు. అయినప్పటికిని అవిమంచి ఫలితములే. అట్లే దుష్కృత్యములు చేయువారు నేనుచేయుచున్న పనులు ఎవరూచూడలేదు అనేధీమాతో చేయుచుందురు. కాని ఆత్మసాక్షి అనునది ఒకటున్నది కాబట్టి " ఈపని నేను చేసినానని తన మనస్సు అహముతో సాక్ష్యము పలుకును. అనగా యెవరూ చూడక పోయిననూ యెవరుచేసిన పని వారికి తెలియును. అదే ఆత్మసాక్షి ఉదా:_ ఒకడు వేరొకరిని హత్యజేసి జైలుకు వెళ్ళి కేసు విచారణా

నంతరము సరియైన సాక్ష్యము లేక శిక్షనుండి తప్పించు కొనును. కాని తన మనస్సు ఈ హత్యను నేనే చేసినానని అహముతో పలుమారులు తలచుకుంటూనే యుండును. ఆవిధముగా ఆహత్యా నేరము తన ఆత్మయందు నమోదగును. ఈ విధముగా తాను చేయు మంచి, చెడులు, తన ఆత్మయందు నమోదై ఆవ్యక్తి చనిపోయిన తర్వాత తిరిగి మానవజన్మ కలిగిన యెడల పూర్వజన్మ ఆ ఆత్మయందు నమోదైన మంచి, చెడులు ఫలితములను కూడ ప్రకృతి సిద్ధముగా దానంతటదే ఎప్పటికప్పుడు నిర్ణయింపబడ యుండును. ఆ ప్రకారముగా ఈజన్మలో అనుభవించు మంచి, చెడులు, సుఖదుఃఖములు సంభవించును అలా సంభవించిన కష్టసుఖములే. "పూర్వజన్మ కర్మ ఫలము' లేక "విధి వ్రాత'' అనబడును.

లలితకళలు మొదలగు విద్యలలో ప్రస్తుతకాలములో కొందరు 6వ యేటను, కొందరు 10వ యేట మంచి విద్వాంసులై ప్రదర్శనలు, సంగీత కచేరీలు చేయుచుండుట చూస్తున్నాము. ఉ: శ్రీమంగళం పల్లి బాలమురళీకృష్ణ తన 6వ యేటనే అద్భుతముగా సంగీత కచేకరీలు చేసినట్లు వినికిడి. మరియు పాలకొల్లు వాస్తవ్యుడు చిరంజీవి శ్రీనివాస్ మేండొలిన్ వాద్యమును వీణా వాద్యముగాతో తన 10వ యేట నుండియే అద్భుతమైన రీతిలో ప్రదర్శనలు మొదలు పెట్టి ఆశ్చర్యతరంగాలలో ముంచి తేలుస్తున్నాడు. విదేశాలలో

కూడా తన ప్రతిభను చాటి అక్కడ వారి మన్ననలను పొం దుచున్నాడు. ప్రస్తుతము వీరిద్దరు ఆంధ్రప్రదేశ్ వాస్త వ్యులైనను, మద్రాసు రాష్ట్ర ఆస్థాన విద్వాంసులుగా ఉం డుట ఆంధ్రప్రదేశ్‌కు తీరని కొఱతగా భావించుట అతి శయోక్తి గాదు. దీనినిబట్టి వీరు పూర్వజన్మలో ఈ కళలో అపారమైన సాధన జేసి జన్మాంతరమున ఈజన్మలో చిన్న వయసులో అద్భుతమైన సంగీత విద్యా ప్రదర్శనలు ేస్తున్నట్లు ఊహించుట కష్టముగాదు. భక్తి మొదలైనవి డా అంతే. దీనినే పూర్వజన్మ వాసన అని కూడా ందురు. అందుచేత పూర్వజన్మతోఏ విద్య అయినా, క్తి అయినా అపరిమితమైన సాధన జేసి పూర్తి కాకుండా నిపోయిన వారే తిరిగి ఈ జన్మలో ఆయా విద్యలలో గురువు అందిస్తుంటే సునాయాసముగా అందుకుని గురువును మించిన శిష్యులై గురువునకు కూడా కొన్ని మర్మములు కొన్ని అందములను గురువు ఆశ్చర్యపడునట్లు చెప్పగలిగిన స్థితి యేర్పడును. అందుకే పూర్వజన్మ సుకృతమని కూడా అందురు. మరియు పూర్వజన్మ కర్మను దాటుటకు ఎంతటి వారికైనను అలవిగాదని అందురు. ఈస్థితి ఆస్తికులకైనను, నాస్తికులకైనను తప్పదు. పూర్వజన్మ పాపపుణ్యముల ఫలితముల వల్లనే హస్తరేఖలు వచ్చును. మరియు ఈ జన్మలో జన్మించు కాలము, మరణించుకాలము, గత జన్మ కర్మ ఫలితము వల్లనే నిర్ణయింపబడియుండును. ఆ జనన

కాలము బట్టియే సరియైన జ్యోతిశ్శాస్త్రమును చదివిన వారు ఈ జన్మకు జరగబోవు మంచి చెడులను చెప్పగలరు. భక్తి కూడా పూర్వజన్మ సుకృతము వల్లనే అలవడును. భక్తి అందరకు అలవడదు. కొందరకు అలవడినా వేర్వేరు రీతులుగా వుండును. పూర్వజన్మమునందు వారి నడతను బట్టి, వారి అభ్యాసములను బట్టి ఈ జన్మలోని భక్తులు వివిధ మార్గములలో నుందురు.

వివిధ రకములుగా మానవులుండుటకు ఒక ఉదాహరణము నిచ్చుచున్నాను. నలుగురు వంటచేయు వారితో ఒక్కొక్కరికి ఒక్కొక్క పాత్ర యిచ్చి అందు ఒకే రకమయిన వంటకమును చేయించినచో వారు వేర్వేరుగా ఒకే రకమయిన వస్తువులు వేసి చేసినప్పటికి ఆ నలుగురూ చేసిన పదార్థము ఒకే రకమయిన రుచి కనబడదు. ఎందుచేత? దీనికి కారణం ఎవరికి తోచినట్లు వారు దినుసులు వేసి చేయుచు పాకము చేయుటలో శ్రద్ధ అశ్రద్ధలను బట్టి వాటివాటి రుచులు వేర్వేరుగా నుండును.

అట్లే ప్రతి మానవుడు ఒకే రకముగా కనబడినన్నూ ఒకే రకమయిన మనస్తత్వముతో నుండరు. ఒకేరకమయిన పనులు చేయరు. వారికి సత్వ రజః తమోగుణముల తేడా వలన వారి వారి అహము నాధారముగా వారికి సంభవించు కష్టసుఖములలో తేడా వచ్చును. అందుచేతనే మానవులందరు ఒకే రీతిగానుండరు. ఒకేరకమయిన జీవనముచేయరు.

అహము ఉండబట్టే వారి పాప పుణ్యములువారి ఆత్మ యందు ఎప్పటికప్పుడు నమోదగును. అహమును నిర్మూలించు మార్గము ఒక అచల గురువునికేకలదు. అహము నశించినయెడల నమోదుచేయు యంత్రము పనిచేయదు. అహమనగాబేటరీలేక విద్యుత్‌శక్తివంటిదని తెలుసుకొంటిమి. బేటరీ గాని విద్యుత్ శక్తిగాని లేనిదే టేపు రికార్డరు పని చేయదు గదా! శరీరమున్నంత వరకు అహముండును. కాని విహిత గురువు అనే అచల గురువును త్రికరణ శుద్ధిగానమ్మి అచంచలమైన భక్తిగలిగి గురువే బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగా, తలచి ఆయన వద్ద ఉపదేశమును పొంది ఆయనకు తను, ధన, మాన, ప్రాణములు అర్పించి తిరిగి దొంగిలించనని ఘోరప్రమాణము చేసి ఆయన చెప్పినట్లు సాధన చతుష్టయమును అభ్యసించిన యెడల అహముతో సహా నీశరీరము నీది కాదు. అప్పుడు నీ అహము వేరై యుండును. ఆస్థితి అయిపోయిన బేటరీవంటిదగును.

అపుడు నీవు అనగా ఉన్న శరీరము పూర్వజన్మ ర్మ ఫలితములను ఈ జన్మములో అనుభవించుటే గాని ఈజన్మలో చేసిన పాపపుణ్యములను ఆత్మయందు నమోదు చేయు యంత్రము పనిచేయదు. దీనివలన నీకు తిరిగి జన్మ ఉండదు. అదే జన్మరాహిత్యము. అచలగురువు నాశ్రయించి ఆయన చెప్పిన సూక్తులాచరించనిదే ఈవిషయములు ఎన్ని

శాస్త్రము విన్నను ఎన్ని శాస్త్రములు చదివినను, అర్థము కాదు. ఈ మార్గము మతమౌఢ్యము గలవారికి అతికష్టము. సర్వమత సమ్మతముగల వారికి సులభసాధ్యము. ఈ మార్గమవలంభించువారికి అతిసూక్ష్మముగా నుండి బహుతేలికగా నుండును. మరియు దాహముగా నున్నవారు నీరుత్రాగినట్లుండును. ఆకలిగొన్నవారికి ఇష్టమైన ఆహారముభుజించినట్లుండును. వేయేల సర్వవిధముల తృప్తిగానుండును.

భగవద్గీత 7వ అధ్యాయము విజ్ఞానయోగమున 3వ శ్లోకము

శ్లోకః— మనుష్యాణాం సహస్రేషు
కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం
కశ్చిన్మాంవేత్తి తత్త్వతః॥

తా॥ ఓ అర్జునా వేలకొలది మానవులలో ఒకానొకడు మాత్రమే యోగశక్తి కొఱకు ప్రయత్నించును, ప్రయత్నించుచున్న యోగులలోగూడ ఒకానొకడు మాత్రమేనన్ను యదార్థముగా ఎరుగును. అనగా తనయదార్థస్థితిని తానుతెలుసుకొనగలడు.

జన్మ పరిపక్వదశ ప్రారంభించునపుడు మాత్రమే ఏ మతస్థులకైనను అచలసాధనయందు మనసుకలిగి అచల గురువునుచేరి జన్మరాహిత్యము జెందెదరు. కనుక ఈబోధ ఏమతమువారికైనను సన్నిహితము, ఆచరణయోగ్యము. ప్రతిమతము భక్తిప్రధానమైనదే గనుక అన్నిమతములు, సమానము. కనుక మతప్రచారము కూడదు. మామతమే గొప్పదనుట మూఢత్వము. బ్రతుకుతెరువుకొఱకు పూటకూలికొఱకు ప్రచారము. కనుక వాదములువద్దు భేదములువద్దు

## 4. దైవము

దైవమనగా శబ్ద,స్పర్శ,రూప,రస, గంధములనే పంచ
న్మాత్రలు లేనిది. పురుషుడుకాక, స్త్రీకాక నపుంసకుడుకాని
ఒకప్పుడు పుట్టనిది. మరెప్పుడు చావనిది. సర్వ ప్రపంచ
మందును లోపలవెలుపల నిండి ప్రతివస్తువు నందునువుం
ఏదియుతనుకానిది, ఉండుటలేకుండుట అనునది ఎరుగని
దైవము. అది నిత్యము, శాశ్వతము అదే ఆదిమధ్యాం
రహితమైయున్నది.

భగవద్గీత 13వ అధ్యాయము 13వ శ్లోకము

శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్ర వక్ష్యామి
యత్ జ్ఞాత్వా ఽ మృతమశ్నుతే
అనాదిమత్పరం బ్రహ్మ
న సత్తన్నా సదుచ్యతే.

పైన వివరించబడిన జ్ఞానముచేత ఎరుగవలసిన
కాబట్టి జ్ఞేయమనబడే తత్వమును గూర్చి వచించె
వినుము. దానినెరిగినవాడు మోక్షము పొందున
అది ఆద్యంతరహితమగు పరబ్రహ్మము. అది
సత్తనిగాని అసత్తని గాని వచింపబడదు. అనగ
భగవత్స్వరూపమునకు నామరూప క్రియులులేవు

ప్రకృతి సిద్ధమయిన దేవతలు 33 కోట్లు అని చెపె
దరు. వీరు ఆశాశ్వితము వీరికి కామ క్రోధాదులు నశించవ
సత్త్వరజః తమోగుణములుగలవు. సృష్టించగలరు. నశిం
చేయగలరు. బాధలు పెట్టగలరు. నివారణ చేయగలరు.

ఉదా:- దేవేంద్రుడు ఎవరైనా ఘోరమైన తపస్సు చేసుకుంటూవుంటే తన దేవేంద్రపదవికి భంగముకలుగునని వారి తపస్సునునాశనముచేయబూనుట.ఎందుకనగా తనదేవేంద్ర పదవి అనేకసారులుపోయినది. ఎట్లనగా కొందరు రాక్షసులు తమతపః ఫలితముగా దేవేంద్రునిపదవినుండి తప్పించి దేవలోకమును స్వాధీనముచేసుకున్నారు. ఇటువంటి ప్రయత్నమువల్లనే విశ్వామిత్రునియొక్క తపస్సునకు భంగము కలిగించుటకై మేనకపంపబడినది. మేనకా విశ్వామిత్రులకు శకుంతల ఉద్భవించినది. భరతుడు శంకుంతల కుమారుడు. మనది భరతదేశము.

కామక్రోధాదులవలన అహల్యను శాపగ్రస్తురాలను చేసి తనుకూడమునిశాపమువలన సహస్రాక్షుడగుట. ఇటువంటి కామక్రోధాదులు పక్షపాతములు ఎన్నో పురాణములలో గలవు. అందుచేత మానవులకు, దేవతలకు తేడా ఏముంది? మానవుడు తలచుకుంటే దేవతలను మించిపోగలడు, దేవతలకు మించినశక్తిని సంపాదించగలడు. ఇతరలోకములను అనగా ఇతరగ్రహములను సందర్శించగలడని ఇటీవల ప్రయోగముల అనంతరము తెలిసినది. కాని ప్రకృతికి సంబంధించిన పంచభూతములను సృష్టించలేరు. ఉదా :- చంద్రలోకములో గాలి, నీరులేదని ఇటీవల కనుగొన్నారు. అందుచేత చంద్రలోకములో జీవసృష్టిలేదు. కనుక చంద్రలోకయాత్రికులు గాలి నీరుతీసుకొని వెళ్ళవలసివచ్చినది.

దేవతలుగా మానవులుగాని పంచభూతములకతీతులు గారు. హిందువులస్వామి ఉ:- వేంకటేశర్వస్వామిని స్వామీ నేను చంద్రలోకమువెళ్లుచున్నాను. నాకు గాలి,నీరు కావాలి. కాబట్టి అక్కడ గాలి నీరు ఉండేటట్లు చూడు తిరిగివచ్చిన తర్వాత నీకొండకువచ్చి నాతలనీలాలు ఇస్తాను. అనిమొక్కుకుంటే సరిపోదు చంద్రలోకములో గాలి నీరు ఉండాలి ఇది జరిగితే అక్కడ జీవసృష్టి జరుగును. హిందువుల స్వామి కాక పోయినా క్రైస్తవులైనా " ఓ ప్రభూ! నీబిడ్డలమైన మేముచంద్రలోకము వలసపోవుచున్నాము కనుక అక్కడ మాకు జీవించుటకు గాలి నీరు సమకూర్చి మాకుటుంబమునకు తోడునీడై ఉందువని నీఘనతనుగూర్చి మిక్కిలి ప్రార్థించు చున్నాము తండ్రీ "ఆమెన్" అని ప్రార్థించిన అప్పుడు గాలి నీరు చంద్రలోకములో ఉండవలెను కదా! ఇట్లే ఏమత మువారైనను సరే ప్రార్థనల వలనగాని మ్రొక్కుబడుల వలనగాని సాధించలేరు.

అనగా మ్రొక్కుబడుల వలన యేదియు జరగదని దీని అభిప్రాయము కేవలం మనోదౌర్బల్యమే మ్రొక్కు లకు కారణము. ఏమ్రొక్కులు మ్రొక్కనివారికి, మ్రొక్కిన వారికి జీవితములో తేడా వుండదు. దేవుళ్ళకుమ్రొక్కక పోయినను పర్వదినములలో నదులయందును, సముద్ర మందు స్నానములు చేయకపోయినను రాత్రి జాగరణలు ఉపవాసములు చేయకపోయినను మానవులకు చెడురాదు.

ఏకేవలం ఆరోగ్యసూత్రములననుసరించి దైవజ్ఞులు ఆ
స్థానములను యేర్పరచిరి. అదిగాక అందరికి అత్యంత
ప్రియమైన బాలుడు ప్రాణాపాయ స్థితిలో వుండగా ఆ
కుటుంబంలో అందరూ ఆచావు నాకురావాలి పిల్లవాడు బ్రత
కాలి అనే ఆతుృతతో వుంటారు. అప్పుడు ఆపిల్లవానిచావు
నాకు యిచ్చి పిల్లవానిని బ్రతికించమనికోరి మ్రొక్కుకుంటే
పిల్లవాడు బ్రతకాలి కోరిమ్రొక్కినవారు చనిపోవాలి
క అతిప్రియమైన వారికి భయంకరమైన వ్యాధి ఉదా :-
జ్వరు, క్షయు, రాచపుండు వగయిరాలలో యేదైనా
వచ్చు అటువంటి భయంకరమైన వ్యాధితో భరింపరాని
బాధనను భవించుచున్నపుడు ఆభయంకరమైన వ్యాధి
నాకురావాలి అతడు బ్రతకాలి. అని మ్రొక్కితే మ్రొక్కిన
వారికి ఆబాధవచ్చి బాధపడేవారికి నయంఅవాలి అలాజరిగితే
మొక్కులవలన తప్పక ఫలితముందనుకోవచ్చును.

అహముచలన మాత్రమే పాపపుణ్యములంటును
దానివలన జననమరణములు సుఖదుఃఖములు కలుగును.
కనుక ఈ ప్రకృతి దేవుళ్ళవలన జన్మరాహిత్యము జరుగదు.

మానవులకు కర్మసిద్ధాంతము కలదు. కర్మవల్లనే
జన్మగలుగును స్వర్గలోకము, నరకలోకము అనునవి వేరే
లేవు. ఈ రెండింటికి ఈ లోకమే స్థానము. మానవుడుచేసిన
కర్మననుసరించి ఈలోకమునందే స్వర్గనరకముల నను
భవించును.

ఈ లోకములో స్త్రీలుగాను పురుషులుగాను మరియు నపుంసకులుగాను పుట్టి,ధనిక,దరిద్ర, సుఖదుఃఖములు అవిటి తనము, మతిచాంచల్యము అనుభవించుటే స్వర్గనరకములు. అంతేగాని వేరేఎక్కడో స్వర్గనరకములుండి ఇక్కడచేసిన పాపపుణ్యములకు నరకస్వర్గావరోహణములున్న యెడల యీ లోకమునందు చేసిన పాపములకు నరకలోకములో ప్రాయశ్చిత్తములు, పుణ్యములకు స్వర్గలోకములో స్వర్గ సుఖములు అనుభవించి తిరిగి జన్మించు మానవులుగాని పశు పక్ష్యాదులుగాని పై విధములుగా అనగా కుంటి, గుడ్డి, మూగ మొదలైన వివిధరీతులలో జీవనముచేయరు. వివిధ మానసిక ప్రకృతులుండవు. వివిధ అంతరములుండవు.

అహంవలన పాపపుణ్యములు సూక్ష్మశరీరమునందు రికార్డుచేయబడునని దాని ప్రభావము వలన జీవితములో సుఖదుఃఖములు మొదలైనవి కలుగునని పూర్వజన్మ కర్మ ఫలము అను శీర్షికలో తెలుసుకొంటిమి.

అహం రహితంవలన సత్వరజః తమోగుణాతీతమైన స్థితివలన యీ జన్మలోని పాపపుణ్యములంటవు. అందుచేత తిరిగి జననమరణములుండవు. సుఖదుఃఖములుండవు. ఇటు వంటిస్థితి కొరకుఅహంరహితంపొందిన అచల సాంప్రదాయ గురువర్యుల వలన మాత్రమే అహం రహితము చెందె దరు. కనుక అట్టి మహాత్ములనువెదకి జన్మరాహిత్యమును చెందవలెను. అదే పరమార్థము. అదే దైవసాన్నిధ్యము. అదే కైవల్యపదవి అదేలానువేరు దైవమువేరు అనుభావము లేకుండునది. శబ్ద స్పర్శ రూపరస గంధములు, చావుపుట్టు

కలు అనేస్థితులులేక ప్రపంచమందంతటా లోపలవెలుపల ములు గ్రుచ్చుసందులేకున్నది. స్త్రీకాక పురుషుడుకాక నపుంసకుడుకాక ఉండుట లేకుండుట అనునది ఎఱుగనిది దైవము కోటిమారులకు ఇదే సత్యము ఇదే నిత్యము ఇదే శాశ్వితము ఇదే భ్రాంతిరహితము అదియే తన నిజస్థితి.

భగవద్గీత 8వ అధ్యాయము అక్షరపరబ్రహ్మయోగం 16వ శ్లోకము.

శ్లో॥ అబ్రహ్మ భువనాల్లోకాః
పునరావర్తినో ఽ ర్జున,
మాముపేత్యతుకౌన్తేయ
పునర్జన్మనవిద్యతే.

తా॥ బ్రహ్మలోకములగాయితు సర్వజగములును కొం
కాలము అనుభవించి పెనువెంటనే తిరిగి తప్పకరా
లసినదే కాని. నన్ను బొందినవారికి మాత్రం తిరి
జన్మయుండదు. అనగా సమస్త భక్తిమార్గములు తిరిగిజన్మనిచ్చునవియేకాని విహితగురువును పొందిన వారికి తిరిగి జన్మఉండదు.

# అచలసాధన సోపానము

## 5. భక్తి

భక్తి అనునది ఒకమానసిక పరిణామము. సర్వసాధారణముగా 1. వినయము 2. విధేయత 3. వ్యామోహము 4.వ్యసనము 5. ప్రేమ 6. కైంకర్యము (కైకంర్యమనగా అర్పణము) ల యొక్క మిశ్రమమే భక్తి ఇది మానవులందరియందు ఉండును. కొందరియందు బాహ్యముగా కనిపించును కొందరియందు అంతర్గతమైయుండి కొన్ని సంఘటనలవలన పైకివచ్చును.

పూర్వము భక్తిఅంటే తెలియనివారు, అనాగరికులు ఎక్కువగా ఉండేవారు వారికి దేహశుభ్రత గురించి గాని, బట్టకట్టుటగురించి గాని, వంటచేయుట గురించి గాని, ఇటువంటి ఆరోగ్యవిధులు తెలియవు. అందుచేత మొదట అతివిజ్ఞతతో దైవజ్ఞులు దేవాలయములను కట్టించి అందు వివిధములైన దేవతావిగ్రహములను ప్రతిష్టచేయించినారు. ఒక సంవత్సరములో కొన్ని పండుగలను ఋతుధర్మము ప్రకారము నియమించి వాటికి ఆరోగ్యసూత్రములతో కొన్ని నియమములను పెట్టినారు. ఉః 1. సంక్రాంతి : ఆరోజున కుటుంబములోని వారందరు తలస్నానముచేసి కొత్త బట్టలను ధరించవలెను. ఈనియమమువలన సంవత్సరము పొడవునా స్నానముచేయనివారు కట్టుకున్న బట్టలువిప్పనివారు ఆనాడు, సంక్రాంతి పండుగ సందర్భముగా తలస్నానముచేసి కొత్త

బట్టలను ధరించినంతనే వారికి కలిగెడు అనుభూతి ఎట్లుండునో వేరుగాచెప్పనవసరం లేదు. మరియు ద్వారములకు పచ్చని మామిడితోరణములను కట్టుటవలన ఇళ్ళలోని చెడు గాలితొలగును. ఇళ్ళనుశుభ్రముగా కడిగి ముగ్గులువేయుట వలన మరియు వీధులలోకూడా ఎక్కువగా ముగ్గులువేయుట వలన కూడా క్రిములుతొలగి ఆరోగ్యము కలుగును.

2. దీపావళి :- ఈ రోజురాత్రి ప్రతియింట అనేకమయిన దీపములు వెలిగించి వివిధరకముల మందుగుండు సామానులను కాల్చివేసిన యెడల గంధకము వగయిరాల పొగవలన అనేకమయిన క్రిమికీటకములు నశించును. దీపపు ప్రమిదలలో కూడ చాల క్రిమికీటకములు చచ్చిపడియుండుట కనిపించును. ఈ పండుగ వచ్చుకాలము కూడా క్రిమికీటకములు ఎక్కువగా ఉద్భవించేదే. అందుచేత దేశములోని అన్ని ప్రదేశములలోను ప్రభుత్వమువారు మందుగుండు సామానులు కాల్చవలసి వచ్చిన యెడల ప్రతిసంవత్సరమునకు కొన్నికోట్ల రూపాయలు ఖర్చగును. దీపావ పండుగవేడుక పేరిట ఈఖర్చును ప్రజలే ప్రతికుటుంబమువారు ఖర్చుపెట్టి చేయుచు ఆనందము అనుభవించుచు తెలియనిరీతిగా ఆరోగ్యవంతులగుచున్నారు.

3. వినాయక చవితి :- ఈ పండుగ పేరుతో వివిధ రకములైన ఆకులు పువ్వులు " పత్రి " అనుపేరుతో ప్రతి

యింట వినాయకునిపూజా మందిరములో ఉంచి పూజచేయు దురు. ఆరోజున ఆ పత్రివలన వచ్చుగాలి అనేకమందికి ఆరోగ్యమును కాపాడును. మరియు ఆరోజునఉప్పు, పులుపు కారములేకుండా అందరూ తీపి పదార్థములు ఎక్కువగా తయారుచేసుకుని తినుటవలన తమకు తెలియకుండా ఆరోజు చప్పిడిపథ్యం చేయుదురు. ఈవిధముగా ఒకరోజుచప్పిడిగా ఆహారముతీసుకొనుట వలన కూడా ఆరోగ్యమును పొందు చున్నారు.

ఈవిధముగా పండుగలు, ఉపవాసములు, జాగరణలు చేయుటవలన భక్తిఅంకురించును. ప్రజలకు ఆరోగ్యము, ఆనందము, నాగరికత కలిగించును. యీవిధముగ దేవాల యములవలన భక్తి అనునది మనసులయందు మొలకెత్తెను

దేవాలయముల యందు నీతి సూత్రములకు సంబం ధించిన రామాయణ, భారత, భాగవతాదుల హరికథలు, నాటకములు, నాట్యములు, బుర్రకథలు, తోలుబొమ్మలాటలు వగయిరాలను ప్రదర్శింతురు. వీటివలనకూడ ప్రజలకు భక్తిభావములు కలుగును. అప్పటినుండి ప్రజలకు దేవాల యము కనబడగానే అక్కడే దేవుడున్నాడని జ్ఞప్తికివచ్చి ఆదేవాలయములోనికి వెళ్ళి దైవనమస్కారములు చేసు కొనుట అలవాటైనది.

ఈ అలవాటు వారమున కొకసారి రానురాను ప్రతి రోజు దేవాలయమునకు వెళ్ళి దైవదర్శనము చేసుకొనుట అలవాటు కలిగినది. ఈవిధముగ అలవాటుపడిన భక్తి రోజు రోజుకు పెరిగి పెద్దదై దీనిని సాధించవలెనను కుతూహలము కొందరిలో కలుగును. కొందరు దేవుడెక్కడైనా గలడను నమ్మకముకలిగి ఇళ్ళలోనే పూజామందిరములు ఏర్పరచుకొని నిత్యదీపారాధన చేసుకొనుట కూడా అలవాటైనది.

భక్తి అనగా తనకు యిష్టమయిన దేవుని త్రికరణ శుద్ధిగా మనోవాక్కాయ కర్మలతో పూజించుట అనగ మనస్సు మాటలు, పాటలు, భజనలు, నాట్యములు, నవ స్కారములతో పూజించుట. హిందూమతములో 33 కోట్ల దేవతలున్నట్లు చెప్పెదురు. వీరికి వివిధమయిన పేర్లుగలవు ఎవరికి ఏపేరుగల దేవతపై భక్తి కలదో ఆ దేవుని పూజిం చెదరు. చాలమంది ఏగుడికనబడితే ఆగుడిలోనికివెళ్ళి ఆదేవు నికి నమస్కారము పెట్టి వస్తుంటారు. అలాచేయకపోతే ఏ దేవుడైనా తనకు హాని చేస్తాడని భయము. హిందూమత ములో ఎవరు ఏదేవుని పూజించినా, ఎక్కువమందిని పూజిం చినాపూజించవచ్చును.

కొందరు స్త్రీలు భర్తలును పూజింతురు. కొందరు తల్లి దండ్రులను పూజింతురు. కొందరురాళ్లను, పర్వతములను నదులను, జంతువులను, పశుపక్ష్యాదులను చెట్లను,

పంచభూతములను, సూర్యచంద్రులను పూజింతురు. వీనిలో ఏఒక్కదానిపైననో లక్ష్యముకుదుర్చుకుని(లక్ష్యము అనగా భక్తి శ్రద్ధలు ) పూజించిన యెడల ఆభక్తికి శక్తి ఎక్కువగా కనబడును. ఇట్లు మనః పూర్వకముగా చాంచల్యము లేకుండగా పూజించువారికి అధికముగా తనకు తెలియని శక్తికలుగును. ఉ:- భర్తను దైవముగా పూజించిన సతీఅనసూయ త్రిమూర్తులనుపసిపిల్లలగా మార్చగలిగినది. సుమతి సూర్యగమనమునే ఆపుచేయగలిగినది. సుమతి అనసూయలు పతిభక్తి తప్ప మరియొకరిపై భక్తి లేదు. అనగా బ్రహ్మ విష్ణు మహేశ్వలను త్రిమూర్తులను గూడ పూజించవలసిన అవుసరము లేకుండా ఒక్క పతిభక్తి వల్లనే అంతటి శక్తి సంపాదించ గలిగినారు. జనకుడు తన గురువైన యాజ్ఞవల్క్యుని పూజించినాడు. ధర్మవ్యాధుడు తన తల్లిదండ్రులను పూజించినాడు. వీరు అచలసాంప్రదాయులు. పై జెప్పిన అనసూయ, సుమతి, జనకుడు, ధర్మవ్యాధుడు మొదలైనవారు ఎవరికి ఎవరిపై లక్ష్యముగలదో వారినే అచంచలమైన భక్తితోపూజించిరి అయినప్పటికి వారికి ఇతరదేవుళ్ళవలన ఏవిధమయిన బాధలు కలుగలేదు. దీనిని బట్టి ఒకవ్యక్తికి యేదేవునియందు లక్ష్యము అనగా నమ్మిక భక్తికలిగియుండునో ఆదేవుని భక్తితో పూజించిన చాలును. అదియే నిశ్చలభక్తి. ఈ విషయము గ్రహించలేక చాల మంది ఒకదేవుని పూజించుచూ ఇతరదేవుళ్ళను కూడా

పూజించకపోతే ఏమిచేస్తారో అని భయపడి దేవుళ్ళందరిని పూజిస్తూ భక్తినిశ్చలతను పోగొట్టుకుంటారు.

ఏ భక్తునికైనను భక్తివలన వచ్చుశక్తి పూజింపబడే దేవుడుఇచ్చిన శక్తిగాదు. తానునిశ్చలమయిన మనస్సుతో చేయు అఖండమయిన భక్తివల్లనే శక్తి తనకు తెలియకనే సంక్రమించును. అయినప్పటికి ఈ శక్తిని గురించి తాను గర్వించుట తగదు. నా శక్తి గొప్పదనిగాని నా భక్తిగొప్ప దనిగాని భావించినయెడల ఆశక్తినశించును.అహంవలన తన కున్న శక్తులన్నియునశించును. అలనాడు విశ్వామిత్రుడు కొన్నివేల సంవత్సరములు తపస్సుచేసి సంపాదించినశక్తి వేరొకరిని కోపముతో శపించుటతో ఆశక్తినశించెడిది. మరల తపస్సుచేసి శక్తినిసంపాదించి మరియొకసారి కోపమునకు వశమై ఇంకొకరిని శపించి తిరిగి సంపాదించిన తపశ్శక్తిని పొగొట్టుకొనెడివాడు. భక్తిని సాధించుటయేగాని ఆభక్తిని, శక్తిని కొలుచుకొనగూడదు, ఆ శక్తిని దుర్వినియోగపర్చు కొనగూడదు. అదియే సరియైన భక్తి.

భక్తునకు శాంతము, నిధానము, దయ, అవసరము ఇవి కేవలం అహం రహితంవల్లనే సంప్రాప్తమగును. కొం దరికి పుట్టుకతోనే భక్తి సహజముగా నుండును. ఉ:– ప్రహ్లా దుడు పుట్టుకతోనే భక్తుడు.

భక్తి మానవులలో రెండురకములు. 1) ఇహపరసుఖములకొఱకు కొందరు దేవునిపూజించెదరు. ఇటువంటి భక్తులు తక్కువ. 2) కేవలం ఐహికసుఖముల కొఱకే చాలమంది దేవుని తాత్కాలికముగా పూజించెదరు. అనగా తమకోరికల కొఱకు మొక్కులు, వ్రతములుచేయుదురు. ఉపవాసములు చేయుట, తీర్థయాత్రలుచేయుట పర్వదినములలో నదుల లోను, సముద్రములోను స్నానములుచేయుట, యజ్ఞయాగాదులు చేయుట ఈ రెండు వర్గములవారు చేయుదురు. కొన్ని యజ్ఞయాగాదులు కూడ ఈ లోకమందు సుఖముల కొఱకే. ఇటువంటి రెండువర్గకపు భక్తులవల్లనే దేవాలయములు అభివృద్ధి అగుచున్నవి. వాటి ఆదాయము కూడ పెరుగుచున్నది.

గవర్నమెంటువారు దేవాదాయ విభాగము పెట్టిన తర్వాత దేవాలయములకు మరింత ప్రచారము ఆదాయము పెరుగుచున్నవి. ఏవిభాగమునకు ఆదాయముతరిగినా దేవాదాయ విభాగమునకు మాత్రము ఆదాయము పెరుగుచునే యుండును. గాని తరుగదు. అదెట్లనగా ఒక్కొక్క దేవాలయమునకు ఒక్కొక్క ఎగ్జిక్యూటివ్‌ఆఫీసరు ఆయనకు కొంతమంది సిబ్బందిఉందురు. వీరు దేవాలయములకుసంబంధించిన దేవుళ్ళ మహిమలను, కథలనుగూర్చి అపరిమితమయిన ప్రచారము చేయుచు ఉత్సవముల కార్యక్రమముల తేదీలను పత్రికలద్వారా ప్రచురించెదరు. తరువాత ఉత్సవము

చేసినది" శ్రీగణేష్ లిథో మద్రాసు - 14 ‹‹ అని ఉన్నది
నేను దీనిని నర్సాపురం ఆంధ్రబ్యాంక్‌లో అంటించినదాని
చూచినాను ఇది కూడా లాభసాటికే అనితెలియుచున్నది

3-12-85 తేదీని విజయవాడ రేడియోవార్త 14 రక్త
దానం చేసినవారికి శ్రీ వేంకటేశ్వర స్వామివారి దర్శన
ముఖద్వారంగుండా చేసుకొనుటకు పాస్‌లు జారీచేస్తారు.

కాని ప్రతిదేవాలయముయొక్క బాధ్యత హిందువుల
దరికి హిందూమతముయొక్క విశిష్టతను విపులముగా ఒ
పథకము ప్రకారము తెలుపవలసియున్నది. హిందువుల
చాలమందికి దీనిగురించి సరియైన అవగాహనలేదు. కను
ఇతరమతములవారు వాడవాడల వచ్చి మీదేవుడుమంచివా
కాడు మామతములోచేరండి మా దేవుడు మంచివాడు మీ
రక్షణయిస్తాడు మనమంతా పాపులము మనపాపములకొఱ
ఆయన శిలువనెక్కి రక్తముకార్చినాడు అరక్తముతో మ
పాపములను కడిగివేస్తాడు కనుక ఆయనరక్షణమీరు పొంద
పోతే మీరు నరకమునకు పోవుదురు. అక్కడమిమ్ముల
కాగినమూనెలో పడవేస్తారు, రంపములతో కోస్తారు. ఎర్ర
కాలినస్తంభములకు కట్టివేస్తారు. ఇటువంటి భయంకరమయి
బాధలు అనుభవించవలసి వుంటుందని, మా మతములోచే
మీకు ఆనరకయాతనలు యేమీవుండవు మనముపాపులమ
భయంకరమయిన మాటలుచెప్పడంవలన హిందువులు న
కముగురించి హైందవమతములో గూఢవిని యుండుటవల

వివిధరకములైన విగ్రహారాధనలు చేయు అలవాటుపడడం వలన హిందూమత సాంప్రదాయము సరిగా తెలియకపోవుట వలన ఇతరమతములపట్ల ద్వేషభావములేని వారగుటవలన మానసికదౌర్బల్యముతో అతిసునాయాసముగాపండితపామరులుకూడా ఇతరమతములలోనికి చేరిపోవడం జరుగుతూవుంది. మతములన్నీ సమానమే కనుక ఒకమతమువారు వేరొకమతములోనికి పోనక్కరలేదు.

హిందూమత సాంప్రదాయముఅతిముఖ్యమైనది అతిప్రాచీనమయినది అతిసున్నితమైనది. ఒక్కొక్క మెట్టువారీగా అభివృద్ధిచెందుటకు సులువైనమార్గముగలది. దీనియొక్క ప్రాముఖ్యతతెలియక చదువుకున్నవారు చదువులేనివారు చాలమంది ఇతరమతప్రచార ఒరవడిలోపడి కొట్టుకొని పోవుచున్నారు.

కనుకదేవాలయపుసిబ్బంది మనదేవాలయముల ఆదాయమును పెంచుటయేకాని చాలమంది హిందువులు ఇతరమతములలోనికి పోవుటను అరికట్టలేక పోవుచున్నారు.

దేవాదాయముతో భగవద్గీతకు సంబంధించిన గురుకులములు, పాఠశాలలు, ప్రతిగ్రామమునందును పెట్టి భగవద్గీతయొక్క సారాంశమును తరగతివారీగా బోధించుచూ మూఢాచారములను నిర్మూలించుచూ పరీక్షలరూపముగా

యోగ్యతాపత్రములను పాసయినవారికి జారీచేయుచు అత్యుత్తమ అభ్యర్థులనుతిరిగి అటువంటిపాఠశాలలలో ఉపాధ్యాయులుగా నియమించినయెడల హిందూమతములోని ప్రతివారికి హిందూమతప్రచారము నిరాడంబరముగా జరుగును. ముఖ్యముగా మూఢాచార నిర్మూలన జరుగనిదే మూల విషయములు అర్థముగావు ఈ విధముగా జరిపించిన దేవాదాయమువలన సద్వినియోగము జరుగును. పౌరులు సద్వర్తనము గలిగియుండును. దేశమునకు శాంతిభద్రతలు కలుగును.

హిందూమతమునకు చివరిమెట్టు భగవద్గీత అదియే సరియైన గ్రంథము అదియే మతాతీతము. అదియే అచల సాంప్రదాయమునకు దారి.

భక్తి అనగా భగవదర్పితం ప్రతిఫలం కోరకూడనిది. నిస్వార్థం, ప్రశాంతం,గంభీరరహితం, నిరాడంబరం, అహం రహితమై ఉండవలెను.

దేవాలయములోనిదేవుని ఒకడు ఒకఆపదలోమ్రొక్కుకొనగా ఆఆపదతీరినది. మరియొకడు తనఆపదలోమ్రొక్కుకొనగా ఆ ఆపదతీరలేదు. దీనికి కారణం ఆ దేవుడుమొదటివానినికరుణించి రెండవవానిని వదలివేశాడని అర్థమగును. కాని ఆ అభిప్రాయము సరియైనదికాదు. ఏలయనకొందరు

యేదేవునికి మ్రొక్కకపోయినను వారి ఆపదలుతీరును. మరి యొక ఉదాహరణః ఎన్నికల సమయములో ఒకసీటుకు 14 మంది అభ్యర్థులు పోటీలో వున్నారనుకుందాం అపుడు అందరూ " ఈసీటు నాకు వస్తే నీ కొండకు నేను వచ్చినా తల నీలాలను ఇచ్చి మిమ్ము దర్శనంచేసుకుంటాను. హుండీలో కూడా కొంతవేస్తాను అని మ్రొక్కుకుంటారు. చివరికి ఆసీటు ఎవరో ఒకరికేవస్తుందని అందరికీ ముందేతెలుసు. సద్భై భక్తిలేనిమానవులే అవుసరాన్నిబట్టి ఇటువంటి మ్రొక్కు మొక్కుతారు.

కష్టసుఖములు, సుఖదుఃఖములుసృష్టిరహస్యము అదే పూర్వజన్మ కర్మఫలితములు. నిజమయిన భక్తి వారికి సుఖములు వచ్చినను ఆసుఖములు వారికికనిపించ కష్టములు వచ్చినను ఆకష్టములు వారికి తెలియవు. ఇది లం భక్తిప్రభావము అనగా భక్తిలో కైంకర్యభావముం వలెను. అనగా సమర్పణభావము అనగా తను ధనమా ప్రాణములు తనవిగానివిగా బావించుట. వాటినిఅచలసాం దాయ గురుశిష్యులు తమకులక్ష్యముగల గురుదేవుని అర్పించెదరు. అపుడు తనువు ధనము మానము ప్రాణము తనవిగానపుడు కష్టసుఖములు దరిద్రము ఐశ్వర్యము తన విగానట్లే తనరక్త సంబంధములు బంధువర్గము, మిత్రుల శత్రువులు తనవిగావని కోటిమూరులకు రూఢిజెందును.

జీవులకు జరిగేవిషయములు జాతక ప్రభావము అనగా నవగ్రహముల ప్రభావము ఇది అందరకు ఒకేలాగుండదు ఇది పూర్వజన్మ కర్మఫలముననుసరించి యేర్పడును. ఒక్కొక్కరి జీవితము ఒక్కొక్కరీతిగా నడచును. భక్తివలన జాతక ప్రభావమే మారును. ఉదా: భక్తమార్కండేయుడు జాతక రీత్యా 16 సంవత్సరముల ఆయుషుగలిగిన వాడు. అయినను అఖండమయిన భక్తి ప్రభావమువలన చిరంజీవి అయినాడని పురాణములో చెప్పబడినది.

భక్తివలన అనగా యేకాగ్రత గల భక్తివలన తనకు తెలియని కొన్ని మహిమలు సంక్రమించును. ఉదా: త్యాగ రాజు మహాభక్తుడుఆయనఒకనాడు పల్లకిలో ప్రయాణము చేయుచుండగా అంతకుముందు ఆపల్లకిలో ఆయనకు తెలి యకుండగా ఉంచబడిన ధనము ( తెలిసైే స్వీకరించరని ) కొఱకు కొందరు దొంగలు వెంటరాగా రామలక్ష్మణులు బాణ ములతో వారిని బాధించగా, దొంగలు జరిగిన విషయ మును చెప్పి త్యాగరాజును క్షమాపణ వేడుట. ఇందుత్యాగ 'జుకు సంక్రమించిన శక్తి తనకు తెలియకనే సంక్రమించి ది. అటులనే పోతన భాగవతమును తెనిగించుచుండగా తనకు స్ఫురించని సమస్యను తానుస్నానమునకై నదికివెళ్ళి నపుడు శ్రీరాముడేస్నానముచేసిన పోతనరూపమునఇంటికి వచ్చి ఆ సమస్యనుపూరించి వెళ్ళినట్లు పోతనచరిత్రలో

చెప్పబడియున్నది. ఈ సంఘటనకూడా పోతనభక్తివల్లనే తనకు తెలియని శక్తి కలిగినది. భద్రాచలములో ప్రభుత్వ సొమ్ముతో కట్టిన రామాలయముగురించి తానీషాకు బాకీపడి పోయిన రు. 6, 00000లు ఆరులక్షల రూపాయిల గురించి రామదాసుని బంధిఖానాలోబంధించి శిక్షించుచుండగా రామ లక్ష్మణులు తానీషాకు అతడు బాకీపడినసొమ్మును రామోజీ లక్ష్మోజీ అను పేర్లతో వెళ్ళి తానీషాకు తీర్చివేసెను. రామ దాసునకు భక్తివల్లనే తనకు తెలియని శక్తివచ్చెను.

త్యాగరాజునకు తానుపల్లకీలో పోవుచుండగా దొంగ లను రామలక్ష్మణులుబాణములతో బాధించుట, పోతన వ్రాయుచున్న భాగవతములో ఒకచోట రాముడే పోతన రూపమున వచ్చి సమస్యను పూరించుట, రామదాసుబాకి రామలక్ష్మణులు వచ్చి తానీషాకు ఆరు లక్షలరూపాయిలు యిచ్చి బాకీతీర్చుట పైముగ్గురిలో ఎవరికీతెలియదు, అయి నను అవిధముగాజరగవలెనని వారికి కోరికయున్నూ లేదు. అందుచేత ఈ విధముగా జరుగుట కేవలం వారికిగల అపరి మితమయిన, ప్రతి ఫలాపేక్షలేనిభక్తి విశేషముల చేతనేతమల తెలియనిశక్తి అట్లు చేయించినది. ఈవిధముగా ప్రకృతిలో ఫలాపేక్షలేని నిశ్చలభక్తివలన ఇటువంటిసంఘటనలు ఎన్నియోజరిగినవి, జరుగును.

కనుకదేవునిభక్తితోపూజించి శక్తినిసంపాదించవచ్చును గాని జన్మరాహిత్యము జరుగదు. కాని పునర్జన్మముమంచిది

వచ్చును. ఎందుచేతననగా నేను రామునిలేక ఒకదేవుని పూజించుచున్నాను అనే అహమున్నది అహం రహితం జరిగిననేగాని జన్మరాహిత్యముజరుగదు. అహంరహితం పొందిన అచల గురువువల్లనే అహం రహితంజరిగి జన్మహిత్యమగును.

# అచలసాధన సోపానము

## మంత్రశక్తి

మంత్రము అనగా మనసునందుగల ఒకకోరిక లేక ఒకపని జరగవలెననే తలంపు సిద్ధించుటకొఱకు తదేకదీక్షతో కొన్నివేలు లేక కొన్నిలక్షలసార్లు జపించుటకు (ఉచ్ఛరించుటకు) దైవజ్ఞులు ఏర్పరచిన కొన్ని బీజాక్షరములతో కూడిన మాటలపొందికను మంత్రమనబడును.

మంత్రమునకు అపరిమితమయిన శక్తి తనకు తెలిసిన శక్తి ఏర్పడును. ఇటువంటి మంత్రములు ఏడుకోట్లుగలవని పెద్దలందురు. ఈమంత్రములను సిద్ధిపొందిన గురువులవద్దనే పొంది వారి ఆజ్ఞానుసారము అభ్యసించవలెను.

మంత్రశక్తి భక్తివలనవచ్చు శక్తికంటె వేరైనది. భక్తివలనకలిగెడుశక్తి తనకుతెలియనిది భక్తితోకూడినమంత్రమువల్లనవచ్చు శక్తి తనకు తెలిసినది. ఎందుచేతననగా ఏ మంత్రము ఏశక్తినిచ్చునో ముందుగనేనిర్ణయింపబడియుండును. ఎవరికిఏశక్తి అవుసరమో ఆశక్తినిచ్చుమంత్రమును తగినగురువువద్దపొంది తదేకదీక్షతో ఆమంత్రమును గురువు చెప్పినరీతిని నిర్ణయింపబడినన్నిసార్లు జపించిన యెడల ఆమంత్రముశిద్ధించి తనకుతెలిసిన శక్తినిచ్చును. ఉదా:- పాముమంత్రము సాధారణముగా దీనిగురించి చాలమందికి తెలియును. ఈమంత్రమును సిద్ధిపొందిన గురువువద్ద ఉప

దేశముపొంది సిద్ధిపొందువరకు గురువుచెప్పినరీతిలో ఆమంత్రములుజపించి తరువాత దానిని ప్రయోగించిన యెడల పాముచే కరవబడినవ్యక్తి స్పృహతప్పిబడివున్న ను విషము హరింపబడి వాడు బ్రతుకును. ఇటువంటిపాముమంత్రములు అనేకములు అనేకపద్ధతులుగా ప్రయోగింతురు. మంత్రములున్న వారి వద్దకు పాములురావు వచ్చిననూ వారినేమిచేయవు ఈ మంత్రముయొక్క శక్తిముందుగనే తెలియును గదా! అట్లే తేలుమంత్రములు మొదలగునవి.

భూతవైద్యము :- దీనికి సంబంధించినమంత్రముల చేత భూతప్రేత పిశాచములను తమస్వాధీనమందుండునట్లు చేయుదురు. మరియొకరికి ప్రయోగించుట గూడగలదు. మనోధైర్యముగలవారే దీనినభ్యసించెదరు. మనోధైర్యము లేనివారికే ఈ భూతవైద్యుల అవుసరంకలుగును ఎందుచేత ననగా ఒకపిరికివాడు చీకటిలో పోవలసినపుడు మార్గములో ఏదైనా ఒకపురాతనపు ఇంటిగోడలనున్న వెల్ల అక్కడక్కడ పోయి నలుపు తెలుపులతో ఏదో ఒక మానవాకారమువలె పించును. లేదా ఒకచెట్టుపై ఒక కొబ్బరాకులాంటిదిగాని పడ్డగాని వేర్లాడుతూ గాలికిఅటూఇటూ ఊగుతూవుండ ్చను. అప్పుడు అది ఒక మానవాకారము కదలాడినట్లు ఈపిరికివానికి కనబడి గుండెఝల్లుమని దడదడకొట్టుకొనును అప్పుడు అతని అవయవముల బలహీనతవలన గుండె

వేగము ఎక్కువై శరీరములోని కొన్ని రక్తనాళములు తెగుట వలన అతనినోటినుండిగాని ముక్కునుండిగాని రక్తము వచ్చి స్ఫృహతప్పిపడియుండును. ఆసమయమున అతనికి వెంటనే వైద్యముజరగకపోయిన యెడల చనిపోవచ్చును. అప్పటినుండి అక్కడదయ్యమువున్నట్లు ప్రచారమగును. ఆప్రచార ప్రభావమువలన పిరికివాళ్ళెవరూ ఆమార్గమున రాత్రులందు ఒంటరిగా వెళ్ళలేరు. ఒకవేళ తప్పనిసరిగా వెళ్ళినను, భయంభయంగా వెళ్ళెదరు. ఆభయమువలన జ్వరము మతిచాంచల్యములేక ఉన్మాదము కొందరికి రావచ్చును. అటువంటి వారికి యీభూతవైద్యులు మంత్రతంత్రములతో బాగుచేయుదురు.

మనోధైర్యముగలవాడైన పైవిధముగ కనబడిన మానవాకారమును దగ్గరకువెళ్ళి పరీక్షించును. అప్పుడది మామూలుగా ఎలావున్న వస్తువులు అలాగే కనిపించును. అప్పుడతనికి మరింతధైర్యము కలుగునేకాని భయముకలుగదు. మొదట ఆవిధముగ ధైర్యముగా దగ్గరకువెళ్ళిచూచి గలుగుటయేమంచిది. అలాంటిధైర్యముగలవారిదరికి భూతప్రేత పిశాచములురావు. మూఢనమ్మకాలవల్లన పిరికితనమేర్పడి భూతప్రేతపిశాచములున్నట్లు భ్రమకలుగును.

ధనుర్విద్య: ధనుర్వేదమునందు ధనుర్విద్యగురించి విపులముగా నుండును. ధనస్సును ప్రయోగించుట ఒకవిద్య. మంత్రశక్తిచేత ధనస్సును ప్రయోగించుట వేరొక

విద్య. అనగా ఉదా:- సర్పాస్త్రము అనే మంత్రముతో విల్లును సారించి బాణమువిడిచినయెడల ఆబాణమునుండి కొన్ని వేల పాములుద్భవించును. అట్లే గరుడాస్త్రము అనే మంత్రముతో బాణమువిడిచిన ఆబాణమునుండి కొన్ని వేల గరుడపక్షులుద్భవించి సర్పములను నాశనముచేయును. అట్లే ఆగ్నేయాస్త్రమునుండి అగ్ని కురియును. జలాస్త్రమునుండి జలముద్భవించి అగ్ని నార్పును. సమ్మోహనాస్త్రమునుండి మత్తును కలిగించు వాయువు ఉద్భవించును. ఆవాయువును పీల్చినవారు స్పృహతప్పిపడిపోవుదురు.

ఇటువంటి విద్యలు మహాభారత కురుక్షేత్ర యుద్ధమునందు ఉపయోగించినట్లు చెప్పబడెను. ఈ విద్యలను ద్రోణాచార్యులవారు కౌరవపాండవులకు నేర్పిరి. ఆయన ఆయా మంత్రములను చెప్పి అభ్యసింపజేసిరి. ఇటువంటి విద్యలు గురువునందు ఎవరికి ఎక్కువ భక్తి విశ్వాసములు ఉండునో వారికే బాగుగా సిద్ధించును. అందుచేత మంత్రమునకు గురుకటాక్షబలముకావలెను. మంత్రసిద్ధికి గురుకటాక్షముతప్పినయెడల పనిచేయదు. ఉదా:- కర్ణునికి గురుశాపమువల్లనే యుద్ధములో అపజయమువాటిల్లెను.

అప్పటికాలములో ఏకలవ్యుడను నతడు ద్రోణాచార్యులవారి కృపలభించక ఆయన విగ్రహమును తయారుచేసుకుని ఆయన యందత్యంత గురుభక్తి కలిగి విలువిద్య తనంతట తానే నేర్చుకొనెను. దీనివలన అతడు విలువిద్య

యుందు అఖండుడైనాడు. కాని గురుముఖముగా పొందవల సిన మర్మములు మంత్రములు ఏమియు ఆయేకలవ్యునకు తెలియవు. కొంతకాలము తరువాత అర్జునున కిచ్చినమాట నిలుపుకొనుటకు ద్రోణాచార్యుడు ఏకలవ్యుని వద్దకు వెళ్ళగా ఏకలవ్యుని ఆనందమునకు అవధులులేవు. అట్టి సమయము నందు ద్రోణాచార్యుడు ద్రోహబుద్ధితో ఏకలవ్యుని కుడిచేతి బొటనవ్రేలునుగురుదక్షిణగా ఇమ్మనికోరినాడు.కోరినవెంటనే ఏకలవ్యుడుతనబొటనవ్రేలును కోసిభక్త్యావేశముతో గురువు గార్కి సమర్పించినాడు గురుముఖతా నేర్చుకొనవలసిన మంత్రప్రభావములేని కారణముగా ఆవిద్యఅంతటితో ఏకల వ్యునికి ఆగిపోయినది. లేకున్న బొటనవ్రేలు లేకపోయి నను మంత్రప్రభావముచేత బాణమును రెండువ్రేళ్ళతో సారించవచ్చును.

అక్షయాస్త్రము :- ఒకబాణమునుండి అనేకబాణము లుద్భవించును. ఇటువంటి విద్యవల్లనే అర్జునుడు ఖాండవ దహనమునందు అక్షయాస్త్రమును ఉపయోగించి వర్షము పడకుండా ఆఖాండవవనముపై ఒకగొడుగులాంటి వితాన మును అడ్డుతెరవలెలేక మంటపమువలె బాణములతో నిర్మిం చినాడు.

అట్లే శ్రీరాముడు విశ్వామిత్రుని యాగముకాపాడు టకు వెళ్ళినపుడు అక్షయాస్త్రమునుపయోగించి ఆయాగము పై "వితానమును" అనగా అడ్డుతెరలాంటి మంటపమును

నిర్మించి మారీచ సుభాహులు ఆయాగముపై వేయు రక్త మాంసములుపడకుండాచేసి యాగరక్షణజేసినాడు.

కొన్ని మాయామంత్రములవలన లేనిదివున్నట్లుగా ఉన్నదిలేనట్లు చేయవచ్చును. ఈ విధముగా శ్రీకృష్ణుడు కుచేలునిఇల్లు గ్రామము గుర్తుపట్టలేనంతగా మార్చివేసినట్లు కుచేలోపాఖ్యానములో చెప్పబడినది. ప్రస్తుతకలికాలములో కూడా విభూది తేనె వగయిరాలు ఫోటోలపై వస్తున్నట్లు వినికిడి.

స్త్రీని పురుషునిగాను,పురుషుని స్త్రీగాను, పక్షులుగాను జంతువులుగాను సిలలవలెనుచేయు సామర్ధ్యము పై మంత్రములకు గలదు.

అక్షయమంత్రమువలన ధన, కనక, వస్త్ర, వాహనములలో దేనినైనను ఎంతవిరివిగా ఉపయోగించినను తరుగక పెరుగుచునేయుండును.

వంశీకరణ మంత్రమువలన ఎటువంటి స్వభావులనైనను ఎంతటిక్రూరమృగములనైననువశపరచుకొను శక్తి కలుగును. ఎంతగొప్ప సభనైనను వశపరచుకొనవచ్చును. దీనినే సభావశీకరణమందురు.

పై మంత్రములన్నియు వేర్వేరు గురువులవద్ద అనగా ఏమంత్రము ఏగురువుసిద్ధిపొందెనో ఆగురువువద్దనే

ఆమంత్రమునుపొంది అభ్యసించి సిద్ధిపొంది పరులకుదాని శక్తినిచూపించి, తాను అనుభూతిని పొందవచ్చును. కాని జన్మరాహిత్యము కలుగదు. ఎందుచేతననగా శ్రీరాముడు ఆజన్మలోపొందిన మంత్రసిద్ధులు ఆజన్మలో ప్రభావము చూపించినవి తరువాత జన్మఅయిన శ్రీ కృష్ణునికి కూడ ఆమంత్రతంత్ర సిద్ధులన్నియు ప్రభావముచూపినవి అట్లే ప్రభావములు చూపించవచ్చును. జన్మజన్మలకు ఈమంత్ర ప్రభావము సంక్రమించుచునే యుండును. గొప్పమహాత్ము లనికూడపేరు ప్రఖ్యాతులుపొందవచ్చును. ఇటువంటివారు ప్రతియుగమునందును వుందురు. వీరికి అహము పెరుగువే కాని తరుగదు. అహమువల్లనే పాపపుణ్యములు, వాటిమూల ముగా సుఖదుఃఖములు పునర్జన్మమునందువచ్చును.

అచలసాంప్రదాయమునకుసంబంధించినద్వాదశి, పంచ దశి, షోడశిమంత్రములవల్లనే జన్మరాహిత్యమార్గము దొర కును.ఎట్లనినఅచలసాంప్రదాయముగలగురువునకు తను ధన మాన ప్రాణములర్పించి ఆయన కరుణాకటాక్షముల వలన పొందిన పైమూడుమంత్రములను జపించినట్లయినఆమంత్ర ప్రభావముచేత ఈస్థూలశరీరమునందుగల సూక్ష్మశరీరము మాడ్చివేయబడును. అదితిరిగి యేశరీరమందునుప్రవేశించి జన్మించకుండును. అనగా శనగగింజను వేయించిన యెడల అదిమాడిపోయి తిరిగిమొలకెత్తు శక్తినశించును అట్లే యీ జన్మయందుగల స్థూలశరీరమునకు పై విషయములవలన

దేహాభిమానముపూర్తిగాపోయి భ్రాంతి రహితమగును. అపుడు సూక్ష్మశరీరమునశించి జన్మరాహిత్యముకలుగును.

సూక్ష్మశరీరమనగా శరీరములను మార్చునది. అనగా ఒకస్థూలశరీరమందు ఆగామి సంచిత ప్రారబ్ధ ఖర్మములను అనుభవించి, కాలము తీరినవెంటనే చనిపోవును. దీనికి వయసుతో నిమిత్తములేదు. అపుడు ఆస్థూలశరీరము నశించును. తర్వాత ఆసూక్ష్మశరీరము ( జీవి ) మరి యొకశరీరమున అనగా ఒకస్త్రీగర్భముధరించగనే పిండ మునందు ప్రవేశించి నవమాసములునిండిన తర్వాత మరల పుట్టిపెరుగుతూ దానిపూర్వజన్మకర్మఫలము ననుభవించి మరలచనిపోవును. అనగాస్థూలశరీరము నశించును. శరీర ములుమార్చుచు తిరుగుచుండునది సూక్ష్మశరీరము. అట్టి సూక్ష్మశరీరమును నశింపజేయుశక్తి పైనుదహరించిన ద్వా దశి, పంచదశి షోడశిమంత్రములకుకలదు. వీటినేమూల మంత్రమందురు. ఆమహామంత్రములనుపదేశించిన గురు వర్యులకరుణాకటాక్షవీక్షణములచేతను ఆగురునియందుతదేక తైలధారవంటినమ్మికచేతనుజన్మరాహిత్యముకలుగును.

ఈమహామంత్రములు సాందీపమహర్షి వలన శ్రీకృష్ణు నికిలభించినవి. పూర్వ అవతారములో దశరధునికి కుమా రుడై వసిష్టునిశిష్యుడై ఆయనవద్ద కొన్నివిద్యలు సంపా దించెను. విశ్వామిత్రునియాగమునుకాపాడుటకు ఆయనతో

వెళ్లుచుండగా ఆయనవల్ల కొన్ని అద్భుతమయిన మంత్రి తంత్రిములను నేర్చుకొని అస్త్రశస్త్ర విద్యలలో అఖండ మయిన ప్రతిభను శ్రీరాముడు సంపాదించెను. శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడు ఆయన సత్యహరిశ్చంద్రుని సంతతి లోనివాడు కనుక సత్యవ్రతుడు నీతినియమములుపాటించు టలో ఆదర్శపురుషుడు. ఆయనకులభించిన మంత్రశక్తి అమోఘమయినది. కానిజన్మ రాహిత్యముజెందించు మంత్ర ములాయనకు, వసిష్టునివలనగాని విశ్వామిత్రునివలనగాని లభించలేదని తెలియుచున్నది. కాని మరల ఆయనకు జన్మ కలదని తెలుసుకొను శక్తిగలదు. కనుకనే తనభక్తులకు కొన్నికోరికలు వచ్చేజన్మలో అనగా ద్వాపరయుగములో శ్రీకృష్ణుడై జన్మించి తీర్చెదనని వరమిచ్చియున్నాడు. అయినప్పటికి ఆయన యీజన్మలోపొందిన సిద్ధులన్నియు మంత్రతంత్రి ప్రభావములన్నియు తరువాత జన్మఅయిన శ్రీకృష్ణునిగా జననమందినకొన్ని ఘడియలలోనే ప్రభావము చూపనారంభించినవి. అవియేవన శ్రీకృష్ణునిగా జన్మించిన వెంటనే ఆకాశవాణిఆదేశానుసారము తండ్రియైన వసుదేవుడు తన కుమారుని కంసుడుచంపుననెడి భయముతో పసిబిడ్డను యశోదవద్దకుతీసుకొనివెళ్ళుచుండెను.అపుడుఒక పెద్దసర్పము ఆశిశువుపై ఎండ మంచు పడకుండా తనపడగనుపట్టి కూ? వెళ్ళును. పూతన అనురాక్షసి మారువేషములో బాలకృష్ణునికి తనవిషపుపాలుఇస్తూ చనిపోవును. కాళిందిమర్ధన, తల్లియశోద

తనకుకట్టినరోలునుబాలుడై నశ్రీకృష్ణుడుదొర్లించుకొనిపోవును. ఆరోలు రెండుచెట్లకు తగలగా అంతవరకు శాపవశమున చెట్లుగావున్న ఇరువురుయక్షులకు ఆరోలుతగలగానేశాపవిమోచనమగును. మందరగిరి పర్వతమునెత్తుట మొదలైన వన్నియు పూర్వజన్మసుకృతఫలితములేగాని వేరుగాదు. యుక్తవయసువచ్చినతర్వాత శ్రీకృష్ణుడుఈశక్తులన్నియు తనకుఎట్లుసంక్రమించినవో తెలుసుకొనవూనుకొనెను. తనకు గలశక్తులన్నియు జన్మరాహిత్యమునకు పనికిరావనిగ్రహించెను. జన్మరాహిత్యమందు కోరికగలవాడై తాను సామాన్యమానవుడనేయనితలంచి తనశరీరముశుక్లశోణితమిళితమైపంచభూతములయొక్క సమ్మేళనాజనితమైనదేనని గ్రహించెను. మాయకుసంబంధించినదేకాబట్టి అట్టిమాయచేతనే తనయదార్ధ స్వరూపమును తెలిసికొనగోరి అచలసాంప్రదాయుడైన గురువు సాందీపమహర్షిని ఆశ్రయించెను. ఆయన ఆదేశానుసారము ఆయనకు శ్రీకృష్ణుడు తను ధన మాన ప్రాణములర్పించెను. తాను అహంరహితుడై తాను సంపాదించిన అచలవిద్యను అర్జునునకు "భగవద్గీత"గా కురుక్షేత్రయుద్ధప్రారంభమున బోధించెను. తిరిగజన్మించెదనని శ్రీరాముని ఎలె కృష్ణుడుఎన్నడును ఎవ్వరికిచెప్పలేదు. ఎందుచేత? తనకు జన్మరాహిత్యమున్నదికనుక సాందీపమహర్షియిచ్చిన ఆమూలమంత్రములయొక్క ప్రభావము ఆయనకు తెలియును కనుక అతిసూక్ష్మముగా యదార్ధవిషయమును

గ్రహించి అష్టభార్యలనుగలిగియుండి 16వేల గోపికాస్త్రీలతో సంచరించినను నేను అస్ఖలితబ్రహ్మచారినన్నాడు. సమస్త రాజ్యభోగములననుభవించుచు దుర్మార్గులను శిక్షించుచూ సన్మార్గులను రక్షించుచూ ఎన్నిగారడీలు చేయుచున్నను తనగురువైన సాందీపమహర్షి వలన తనయదార్ధవిషయమును తెలుసుకొనినవాడై అహంరహితుడయ్యెను. ఆయనఇచ్చిన మంత్రప్రభావమువలన తనకు జన్మరాహిత్యమున్నదని భావించెను.

మంత్రశక్తి తనకుతెలిసినశక్తినిచ్చునని తెలుసుకున్నారుగదా! అట్లే యీ మూలమంత్రములవలన తిరిగిజన్మ లేదని ముందుగానే తెలిసినది.

ఈవిధముగ శ్రీకృష్ణుని అంతటిగారడివానికే గురువు కావలసివచ్చినపుడు ఏయుగములోనైనను ఎంతటిమహాత్ములకైనను జన్మరాహిత్య మార్గమునకు అచలగురువు కావలసియేయుండును.

ఎటువంటిమానవుడైనను అనగా మూర్ఖుడైననూ వ్యభిచారి, దొంగ,ఖూనీలుచేయువాడు,అబద్ధమాడువాడుస్వలాభిచాడీలు చెప్పువాడు మొదలైనవారిలో ఏజాతివారైననూ ఎవ్వరైనను మనసునందు మార్పుజెంది భక్తియందాసక్తి కలిగియుండవలెను. శాంతమునలవరచుకొనవలెను. అట్టి వారే అచలబోధకు అర్హులు.

అష్టసిద్ధులుగాని మంత్రసిద్ధులుగానిపొంది వాటి ప్రభావముచేత కొన్ని గారడీలు లోకమునచూపించినయెడల ప్రజలలో ఇతడుగొప్ప మహాత్ముడు అనిపించుకొనవచ్చునేమోకాని ఎటువంటి మహత్ముడైనను అచల సాంప్రదాయముగల సద్గురువు నాశ్రయించనిదే జన్మరాహిత్యముపొందలేరు. అందుచేత ఏజాతివారైనను ఏమతమువారైనను ఏవయసువారైనను అచలసాంప్రదాయ గురువు నాశ్రయించి జన్మరాహిత్యముజెందెదరుగాక.

# అచలసాధన సోపానము

## మతము - మతద్వేషము - మతాతీతము

మతము:- మతమనగా భక్తికి సంబంధించిన కూటమి. దీనికి కొన్ని నియమములను, ఆచారములను తోటిమానవుల పట్ల ఉండవలసిన మంచిప్రవర్తనా లక్షణములు మొదలై నవి మతమునందు పొందుపర్చబడి ఆమతమునకు సంబం దించిన దేవునికి ఒకపేరు ఆకారము ఆయనను పూజించు విధానముబోధింపబడును.

ప్రతిమతమునందు ఆదే విధముగావుండును. అందు చేత ప్రతిమతమువారు వారిమతవిధానము ప్రకారము వారి దేవునిభక్తితోపూజలు, భజనలుచేసుకుంటూ వుందురు. అందు చేత ఏమతమువారైననుభక్తులే అన్నిమతములుసమానమే. కాబట్టి ఇతరమతములవారిని ద్వేషించకూడదు. మామతమే గొప్పదని ప్రచారముచేయకూడదు. ఏమతమువారైనను, నిజమైన భక్తులుకావలెను. వారికి శాంతము, కరుణ, దయ ధర్మబుద్ధి ఇతరమతసహనము కలిగియుండవలెను. కేవలం వారు భక్తికొఱకు నిత్యంచేయవలసిన విధానమును శ్రద్ధగా చేయుచు వారి సంసారమునకు కావలసిన ధన సంపాదనవారి కుటుంబ ఆరోగ్యవిధులు చూచుకొనుటయే కాని ఇతరమత ముల గురించి విమర్శించకూడదు. ఇతరులకు వారు ఆదర్శ వంతులుగా వుండవలెను. ఈ విధమయిన భక్తులు ప్రతి

యుగమునందును ప్రతిమతమునందును గలరు. కనుక భక్తికిసంబంధించిన అన్ని మతములు సమానమే.

మతద్వేషము :- మతాభివృద్ధిచేయవలెనని ఆసక్తి గలవారికి ఇతరమతములయందు ద్వేషముకలుగును. ద్వేషముచేతనే మామతముగొప్పది. మీమతముమంచికాదు. మా మతములోచేరండి అని ప్రచారము చేయుదురు. ఆవిధముగ తమమతములోచేరకపోయిన నరకమునకుపోవుదరని భయపెట్టెదరు. కొందరికి ధనమునిచ్చి కొందరికి ఉద్యోగము ఆశ చూపి ఇట్లు అనేకవిధములయిన ప్రలోభములనుచూపి తమ మతములోచేర్చుకొని మతాభివృద్ధిచేయుచున్నారు. ఈవిధముగా క్రైస్తవమతములో కొందరు పనిపాటలు మాని ఈ ప్రచారవృత్తిని "క్రీస్తుసేవ" అనుపేరట చేపట్టి దీనిపైనే కుటుంబజీవనము చేయుదురు. వాడవాడలకు పోయిప్రచారముచేయుచున్నారు.

శైవవైష్ణవ మతములు హిందూమతములైనను శైవమతమని, వైష్ణవమతమని వేర్వేరు మతములుగాభావించి ఒకరికొకరు పరస్పరవిభేదములుపెట్టుకొనిరి. వీరిలోకొందరు శివకేశవులిద్దరు ఒక్కరేగాని వేరుగాదని కూడ అందురు. అయినప్పటికి ఈ రెండుమతములకు అనగా శైవులకు, వైష్ణవులకు ఒకప్పుడు యుద్ధములుకూడ జరిగినవి. వీరిలో

ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతములుగా కూడా విభజించివారి
రి అభిప్రాయములను ఈమతములలో చెప్పించిరి.
ప్పటికీ వైష్ణవాలయములలో శైవసిద్ధాంతములను చెప్ప
యరు. వీరున్న చోట వారుండరు, వారున్న చోట వీరుండరు
తాభిమానము వుండవచ్చును గాని పరమత ద్వేషము
ండరాదు. మతద్వేషము గలవారికి వారి మతసంబంధ
యిన దేవునియందు గల భక్తిశ్రద్ధల కన్నా ఇతర మత
ులయందు ద్వేషము గలిగించుకొని వారి లోపములను
ర్చి అన్వేషించుచు వారిని విమర్శించుటకు తగిన ఆధార
ుల కొఱకు మాత్రమే ఆలోచించుచుందురు. దీనివలన
పదేవుని నిశ్చలభక్తితో పూజించలేరు. అటువంటి వారు
ానవత్వమునే కోల్పోవుదురు. కొన్ని సమయములందు
పగా మత సంబంధమయిన తర్కవితర్కముల యందు
హనము కోల్పోయి హత్యలు చేయుటకుకూడ వెనుకాడరు
ప మతము మంచిదికాదను మాటనువిని వారు ఎంత
ాత్రము సహించలేరు.

ఏమతమయినను భక్తి ప్రధానమయినది. కనుక ఒక
తమువారు ఇతరమతములను నిందించుట మూర్ఖత్వము,
మానుషము అగును. అన్ని మతములలోను మహాత్ములు
రు. కాబట్టి మామతమే గొప్పది అనుట తెలివితక్కువ.
మతమువదలి మామతములో చేరవలెను అనుట్టపట్టున్నదనగా

ఒకస్త్రీ మరియొకస్త్రీతో నీభర్తనువదలి వేరొకరినిచూచుకొమని అన్నట్లుండును. కాని ఎవరిభర్త వారికి గర్వకారణము. భర్త బీదవాడనిగాని, గొప్పవాడనిగాని, బలవంతుడనిగాని, రోగస్తుడనిగాని సరియైన భార్యకు తారతమ్యము కనబడదు. అట్లే మతమునందు సరియైన భక్తునికి సరియైననమ్మకము కుదురును. భక్తిప్రధానముగాని మతముఏదైనను ఒకటే. మతముమార్చుకొనవలసిన అవసరంలేదు.

అందుచేత మతద్వేషముమాని ఎవరిమతసిద్ధాంతములను వారు అవగాహన చేసుకొని వాటికితగినవిధముగా నడవడికను అలవాటు చేసుకొంటూ ఎవరికుటుంబమునకు కావలసిన అభివృద్ధి కార్యక్రమములనువారు చేసుకుంటూ భక్తిని సాధించుకొనవలెను.

మతాతీతము :— ఏమతములోను అహమునశించు మార్గములేదని తెలుసుకొంటిమి ( పూర్తివివరణ " అహము గలవారు అహములేనివారు అనుశీర్షికలో చెప్పబడినది. ) అన్నిమతములకు ఒకటేశరణ్యము. అదేఅచలము లేక పరిపూర్ణము. అదే అహం రహితమార్గము దీనినే బట్టబయలని కూడ అందురు. ఇన్ని పేరులు అదే శబ్ద, స్పర్శ, రూప, రసగంధములు అను పంచతన్మాత్రలులేనిది. చావుపుట్టుకలు లేనిది. సమస్తనదులకుఆధారమైన సముద్రమువలె సమస్త

...తములకు ఆధారము. దీనికి జాతి, వర్ణ, కుల, మత, స్థాన ...దములులేవు, ఆచారముతో పనిలేదు ఉపవాసములతో పని ...దు పర్వదినములలో సముద్రస్నానములు నదీస్నాన ...ులు. చేయనవసరములేదు. యజ్ఞయాగాదులతోపనిలేదు. ...దే వుత్కృష్టమైనదని ప్రచారములేదు. వేయేల అన్నిరోగ ...ులకు పథ్యములేనిమందు వంటిది. కానియేమతమువారికైన ...ను జన్మరాహిత్యముజెందు కాలమాసన్నమైనపుడే దీని ...యందుఆసక్తి కలుగును. ఇందుచెప్పబడినవిషయములు అర్థ ...గును అపుడే దీనినాచరించవలెనని కుతూహలము ప్రియ ...్నముకలిగి అచలగురునిచేరెదరు.

" బుద్ధి కర్మానుసారిణి "

# అచలసాధన సోపానము

## ఆచారము

ఆచారమనగా ఆరోగ్యముగా ఉండుటకు కొన్ని నియమములు నిబంధనలు నిష్టలను దైవజ్ఞులు నియమించిరి. దైవాంశ పిపీలకాది బ్రహ్మపర్యంతముప్రతివస్తువునందును లోపలవెలుపల ములుగుప్రచ్చుసందులేక నిండియున్నది. కనుక ప్రతివస్తువులేక పదార్ధము ప్రతిజీవియు అంతర్యామునందు పవిత్రమైనవే బాహ్యమునందు కొన్నివస్తువులు లేక పదార్ధములు కొన్నిజీవులు అసహ్యకరమై ముట్టుకొనజాలనివిగానుండును. ఉదా:- మలమూత్రములు, చమట ఉమ్మి, రుతురక్తము మొదలైనవి.

అట్టిఅసహ్యకరమయినవాటి విషయములో పరిశుభ్రత చేసుకొనుట సహజము, ఆరోగ్యము. కాని ఇవన్నియు మన శరీరములోనే వుండి కొంతభాగము శరీర ధర్మముగా బయటికిపోయినను, కొంతభాగము శరీరములోపలే మిగిలియుండును. అవి మనశరీరముపైగల చర్మముకప్పబడియుండుట వలన మనలోని పైజెప్పిన పదార్ధములన్నియు కనబడవు. మురికిలో దొర్లిన శరీరముపై చక్కనివస్త్రముకప్పుకొనినచో ఆమురికి కనబడదు కదా! ఈ విషయము సమస్త జనులకు తెలిసిన విషయమే కాని కొందరు అతినిష్టా చాందసులు స్నానముచేసి శుచిగాఉన్నామనే తలంతురుగాని ఇవన్నియు

నలోపల కొంతభాగము ఉన్నవని తలంచరు. స్నానమ్ము చర్మమును శుభ్రపరుచుకొని ఆరోగ్యముగా నుండుటకు ౹త్రమే.

స్త్రీలు బహిష్టు అయినపుడు ముట్టుకొనరాదని దూర ంగా నాలుగురోజులు ఉంచెదరు. ఈ ఆచారము ఆరోగ్య ంకొఱకేనని చాలమందికి తెలియదు. ఎందుచేతననగా లు బహిష్టు అయినపుడువారి అవయవములు చాల బల నముగానుండును. అందుచేత నీర్సముగా నుందురు. ువంటి సమయములందు స్త్రీలు కదలకుండా నాలుగు జులు విశ్రాంతి తీసుకుంటూ ఉప్పు, పులుపు, కారము ండా చప్పిడి భోజనము తీసుకొనుట మిక్కిలి ఆరోగ్య ము. అందుచేతనే మొదట ఆడపిల్లలు రజస్వల అ ్పుడు తీపిపదార్థములు తప్ప ఉప్పు, పులుపు, కారము ు పదార్ధములు పెట్టరు. ఈవిధముగా చేయుటవలన వా ర్భాశయము ఆరోగ్యముగా వుండును. అట్లుగాక అపథ్య ంచేసినయెడల జీవితకాలమంతయు గర్భాశయరోగము ో బాధలుపడవలసి యుండును అనగా బహిష్టునొప్పులు, ేక ఋతురక్తస్రావము, అసలు బహిష్టు కాకుండగానుం ట మొదలైన బాధలు కలుగును. బహిష్టులోనుండగా వారు ఇటు తిరిగిన యెడల దుష్టరక్తపు దుర్గంధము గాలిలో సి మిగిలినవారి ఆరోగ్యముచెరచును. మరియు బహిష్టులో

నున్నవారు పనిచేయుచుండిన యెడల గర్భాశయము బల హీనమై రక్తస్రావరోగము రావచ్చును. అందుచేతనే శాస్త్రజ్ఞులు బహిష్టయిన స్త్రీలు నాలుగురోజులు విశ్రాంతిగా ఉండునట్లు పై ఆచారమును అలవరచిరి. అంతేగాని బహిష్టు లోనుండగా. ముట్టుకొనరాదని మాత్రముగాదు. ఎందుచేతన నగా ఋతురక్తము బహిష్టురోజుకు ముందుకూడ శరీరములో నున్నదే అదేకాక ఋతువైన నాలుగురోజుల తర్వాతకూడ కొందరికి రక్తస్రావము తగ్గక ఇంచుమించు 15రోజులవరకు జరుగుచునేయుండును. అయినను 4రోజులతర్వాత స్నాన ముచేసి ఇంట్లో తిరుగాడుచుందురు. ఈసత్యమందరకు తెలిసి నదే. అప్పుడు ముట్టరాదనిది ఎందుకుకాకూడదు? బహిష్ట అయిన స్త్రీని ఎవరైనా ముట్టుకుంటే బట్టలు విప్పి స్నానం చేయాలనే ఆచారము గలదు. ఈ ఆచారమువలన కొన్ని సమయములలో కొన్ని ప్రమాదములు సంభవించును. ఎట్లు నిన కొన్ని రోగముల వారు స్నానంచేయగూడదు. జ్వరం మలేరియా మొదలైన రోగములుగలవారు. అట్టివారు పొర పాటున ముట్టుకుంటే వెంటనే స్నానం చేయాలి గదా! అలాస్నానంచేస్తే రోగమెక్కువై కొన్నిసమయములందు సంధివగయిరాలు వచ్చి ప్రాణములు కోల్పోవుదురు.

మరియు ఎవరైన తమ జ్ఞాతులు చనిపోయినపుడుదూర ముగా నున్నవారికి చనిపోయిన వార్త విన్నతోడనే అపుడు

అర్ధరాత్రిఅయినను స్నానం తప్పనిసరి అనిచేయుదురు. లేనియెడల దోషమంటునని భయము. ఆవిధముగ 10రోజులు మైలపట్టి మగవారుగడ్డమువగయిరాలు పెంచుదురు. మానవ శరీరమేమైల శరీరము. శుక్ల శోణితముల కలయికతో 9నెలలు గర్భసంచి అనే ముధికికూపమున అల్లాడి, శరీరము ధరించి పెరిగి యీ లోకములోనికి రావలెను. అటువంటి మైలశరీర మునకు వేరేమైలఎందుకు? ఈ ఆచారమునందు మైలు అనుటకు కొన్ని ఉపయోగములు కలవు. సర్వసాధారణ ముగా కుటుంబములోని వారు ఎవరైనా చనిపోయినపుడు ఆకుటుంబమువారు విచారముగా ఉందురు.వారింటికి పరామ ర్శకు చాలమంది వచ్చెదరు. ఎవరువచ్చినా ఆకుటుంబము లోనివారే ఆవిచారములోనుండి ఇంటికిపరామర్శకు వచ్చిన వారికి గౌరవమర్యాదలను చేయనక్కరలేకనే అక్కడకు వచ్చినవారిలో మైలులేనివారు కొందరు ఆ కార్యక్రమము పక్కబెట్టెదరు. ఆవిధముగా వారికి కొంతమానసిక విశ్రాంతి శాంతిని చేకూర్చుటకే ఈయాచారము విజ్ఞులు నియమించి రనుటలో సందేహములేదు.కాని మైలు, ముట్టుకొన గూడదని మాత్రముకాదు. కొన్ని జాతులవారిని అంటరానివారుగా నిర్ణ యించి వారికి ఇతరజాతులవారు దూరముగావుండే ఆచారం పూర్వము అలవరచిరి. వారు పూర్వము అనాగరికులై శుచి శుభ్రత తెలియక స్నానమువగయిరాలతో శరీరమునుశుభ్ర పరచుకోవట్లే అలవాటు లేకపోవటం వలన దుర్వాసనతోనుండి

వుండవచ్చును. అటువంటి వారిని శుభ్రతకలిగిన నాగరికులు దరికి చేరలేక పోవచ్చుననుటలో సందేహములేదు, ఆశ్చర్య మూలేదు. అందుచేతనే ఈఅంటరానితన మేర్పడియుండ వచ్చును. కాని ప్రస్తుతకాలములో ప్రతివారు విజ్ఞానవంతులై ఆరోగ్యవిధులను పాటించుచున్నారు. అటువంటి వారినిముట్ట రాని వారనుట పొరపాటు, మూర్ఖత్వము. పూర్వము జాతి భేదము అనుమాట వారివారివృత్తులవలన కలిగెనేగాని మాన వులందరూ ఒకేజాతి, ఒకే పుట్టుకఅనగా లోకమందుగల 84 లక్షల జీవరాసులలో మానవులు ఒకజాతి మాత్రమే అయి ననూ ప్రస్తుతకాలములో ఎవరి వృత్తివారే చేయక ఉన్నత కులస్తులు అనువారుల బార్బరుషాపులు, లాండ్రీలు, చేపల వ్యాపారములు వగయిరాలు చేస్తున్నారు. కాబట్టి నిజమ యిన భగవద్భక్తులకు యిటువంటి జాతిభేదములు ఆచార ములు భక్తికిఆటంకమే. అహర్నిశములు భగవచ్చింతనలో నుండవలసిన యీ మానవజన్మము ఈ ఆచారము పేరుతో అప్పుడప్పుడూ భక్తికి అంతరాయములు కలిగించకూడదు. ఎందుచేతననగా ఈమానవజన్మము అతిపవిత్రమైనది. దీనికి అవసానకాలము ఎప్పుడైనను రావచ్చును. కనుకబహిష్టులో ఉండిన స్త్రీలుగాని మైలు లేక సూతకములలోనుండిన వారు గాని భగవధ్యానము మరువకూడదు. కనుక మనస్సును పవిత్రముగానుంచిన శరీరమునకు యీ ఆచారములతో పని లేదు. అసలు ఆచారము అను మాటేగుర్తుకురాకూడదు.

్నానము చేయకుండా దీపారాధన చేయకూడదనుట, భోజ
ము చేసినతర్వాత పూజలు చేయకూడదనుట. అల్పాచమాన
ములు చేయుచున్నపుడు జపములు చేయుకూడదనుట
ంచిదికాదు. జపతపములు అనుష్ఠానములు చేయువారలకు
ఈఆచారములతో పనిలేదు. అహర్నిశము లు అనుష్ఠానము
రుగుచునేయుండవలెను. నిద్రవచ్చువరకు మరణమొచ్చు
రకు చేయవలెను. నిత్యానుష్ఠానమే గొప్పది. అదే కైంకర్య
ావము అట్టివారికి నిత్యజీవితములో సుఖదుఃఖములు తెలి
యవు పాపపుణ్యములంటవు.

జీవితము నీటిపై బుడగవంటిది. అదిచూచుటకు రంగు
రంగులతో మహాసుందరముగా కనబడును. అదినీటిప్రవా
హములో పోవుచు, పోవుచు ఎప్పుడు ఎక్కడ పగులునో
తెలియదు అటువంటిదేజీవితము. కనుక జీవితముండగనే తన
నిజస్థితిని తెలుసుకొనవలయును. లేనియెడల ఉత్కృష్ట
మయిన మానవజన్మము నిరర్థకమగును. కనుక ఈఅచా
రములనగా కేవలం ఆరోగ్యమును కాపాడుకొనుటకే గాని
వేరుగాదని ధృడముగానమ్మి నిజమైనభక్తులు భక్తికిఆచార
మునకు ఒకదానితో నొకటి ముడిపెట్టకుండా నిశ్చలమైన
భక్తిని సాధించుకొనవలెను. ఉదా: ఒకడు ప్రమాదవశమున
ఒకమూబిలో దిగిపోతూవుంటగా అతని శరీరమంతామురికితో
నిండియుండును. అట్టిసమయమందు భగవధ్యానముగాని

మంత్రోచ్చారణగాని స్నానము చేయకుండగా చేయగూడదు గదా! [2] ఒకడు జబ్బుపడి స్పృహలోనున్నప్పటికి లేవ లేని స్థితిలో ఎవరూ దగ్గరలేని సమయములో మలమూత్రా దులు ప్రక్కమీదనే వెడలి పడియుంటె అతనికికూడ స్నానము చేయకుండా భగవధ్యానము చేయుటకు ఆటంకమే గదా! కనుకభక్తులు ఆచారముపట్ల నిర్లక్ష్యవైఖరి నవలంభించి నిత్యముఆరోగ్యం పాటించుకుంటూ అంటు. ముట్టు,మయిలు వగయిరాలకు మనోవికల్పముచెందక స్థిరబుద్ధితోను అచం చల భక్తితోను అహర్నిశములు మంత్రానుష్ఠానములు చేసుకొనుచుండవలెను.

పరుల మంచినిగాని అభివృద్ధినిగాని,ఆనందమునుగాని చూచి ఈర్ష్యపడకూడదు, అసూయపడకూడదు,తనకు లేదని ఏడవకూడదు,ఈర్ష్యాసూయలవలన మనసు పాడగును.ఆరో గ్యముచెడును..పరులచేత అసహ్యంపబడుదురు. లోకకంటకు లగుదురు. అటువంటివారు ఎటువంటి దుర్మార్గపు పనులు చేయుటకునైనను వెనుకాడరు. అటువంటి మనసుకు భగవ ద్భక్తికి కూడతావుండదు. అసలు అటువంటి ఆలోచనేరాదు. పరుల అభివృద్ధిని పాడుచేయుటకు మార్గములను మన సెప్పుడూ వెతకుచునే వుండును. తన అభివృద్ధినిగాని తన మంచినిగాని పెంచుకొనే తలంపుగాని ప్రయత్నముగాని

గాని కలుగదు. జీవితాంతము ఈర్ష్యాసూయలతో క్రోధమును పెంచుకొని శరీరమునకు నిలువెల్ల విష ంచుకొనుచు, ఆవిషము వలన తనను తాను మరచి తాను చేసే పని యేమిటి దానివలన తనకు ఫలిత టి అనిగాని దీనివలన పరులకు నష్టము హాని జరుగును విషయమే గుర్తుకురాదు. అయినప్పటికి ఈర్ష్యా యలతో ఇతరులకు హాని తలపెట్టినప్పుడు దానివలన తాత్కాలికముగా చెడుజరిగిననూ ఆచెడు చివరకు గా మారును. " అంతయూ మనమేలునకే " అను త అందుకే వెలువడినది. అందుచేత ఎవరికైనను వలన హాని జరిగినప్పుడు వికలము చెందక మనసు చేసుకొనకుండావుంటే కొంతకాలము తరువాత జరిగి న చెడ్డరోజులు మన మంచికేనని రూఢిగా తెలియును. వుడెంత దుర్మార్గుడైనను మహాత్ముడగుటకు తావున్న తెలుసుకొంటిమి. అది ఎప్పుడో ఒకప్పుడు ఒకక్షణములో ప్ప జరుగును. (ఉదా: వాల్మీకి)

నుక క్షణికమైనటువంటి అశాశ్వతమైనటువంటి ఈ శరీ ను శుభ్రము చేసుకొనుటకు ముందు మనసును శుభ్ర కొనవలెను. మనసు ప్రశాంతముతోను భక్తితో కూడిన దముతోను నింపవలెను. నిజగురుని వెదకి ఆయన ములను పట్టి సాష్టాంగ నమస్కారములు చేయవలెను. న చెప్పిన సూక్తులాచరించవలెను. అపుడే ఆచార లగుదురు.

# అచలసాధన సోపానము

## కోరికలు - నివారణ

ప్రపంచము మాయా ప్రపంచము. కనుక మానవజీవితము మాయచేత ఆవరింపబడి యున్నది. కోరికలు అనునవి జన్మతోవచ్చును. అనగా శరీరావసరములు. కోరికలు రెండు రకములు అవి మంచికోరికలు, చెడుకోరికలు మంచికోరికలు అనగా తనగురించి, తనవారిగురించి, పరులగురించి మంచిని అభివృద్ధిని కోరినవి. కొందరు తనగురించి తనవారి గురించే మంచిని కోరు కొందురు. ఇవి సహజములు. వీనికి వ్యతిరేక ముగా కామ, క్రోధ,లోభ, మద, మాత్సర్యములతో కూడిన కోరికలు. ఇవి తనకేగాని ఎదుటవారికి ఆనందముకలిగించవు. కాని ఇవికూడ సహజములే. మంచికోరికలుగాని చెడుకోరికలు జీవితము వున్నంతవరకు వారివారి మనోభావములను బట్టి వచ్చుచునే వుండును. కోరికలు అరికట్టుట ఎంతటి వారికైనను సాధ్యము కాదు. బుద్ధుడు 'కోరికలు దుఃఖమునకు కారణము కనుక వాటిని చంపుకొనవలె'ననిచెప్పియున్నాడు పరిశీలించెదము. సంసారములో ప్రతి వ్యక్తికి కొన్ని అవ సరములుండును. ఆ అవసరాలు తీర్చుకొనుటకు కొన్ని మార్గములను చూచుకొనవలెను. ఇట్లే ప్రకృతిలోను ప్రతి జీవికి అవసరాలుండును. అవికోరికలుగావు. మంచివారుగాని చెడ్డవారుగాని వారిఅవసరములకే కోరికలు కలిగివుందురు.

) తీరకపోయినను కొందరు బాధపడకసరిపెట్టుకొందురు. ్గ సరిపెట్టుకొనువారికి కోరికల వలన విచారమును కలి చవు. చివరకు క్రూరమృగములైనను తనకు కనిపించిన తువును తరిమితరిమి పట్టుకొని తిని తృప్తిగా వుండును. కు ఆ జంతువు దొరకక పోయినను వేరే ప్రయత్నము ము నుగాని అదిదొరకలేదని విచారముగా వుండదు. ఇది కృతి సహజము.

గౌతమబుద్ధునితండ్రి శుద్ధోదనుడు కుమారుని జాతకమును ్లిన వెంటనే జ్యోతిష్యులతో చూపించగా అతడు మహా ్రవర్తిగాని, మహాయోగిగాని అగునని చెప్పియున్నారు ుడు తండ్రి శుద్ధోదనుడు తనకుమారుడు మహాచక్రవర్తి మహాయోగి అవునేమోఅని భయపడి కుమారుని అంతః ములోనేవుంచి బయటి ప్రపంచము చూచుటకు ఎప్పుడు కాశముయివ్వక సకల రాజభోగములతో బందీగానే ంచినాడు. ఒకనాడు గౌతముడు బయటికి వెళ్ళుట తట చినది. బాధలతోనున్న వారిని,ముసలివారిని, చనిపోయిన ంచి కలతచెంది. తనంత తానుగా యెవ్వరి ప్రబోధము ండగా. భార్యాబిడ్డలను తల్లిదండ్రులను విడిచి వెళ్ళి యెను. అవిధముగ వెళ్లిపోవుట కోరికయే అగును. తర త తనంత తానుగానేబోధి వృక్షము క్రింద కూర్చొని లోని జ్యోతిని దర్శించి సిద్ధుడైనాడని బుద్ధుని చరిత్ర.

భగవద్గీత నాలుగవ అధ్యాయం జ్ఞానయోగములోని 20వ శ్లోకము :

త్యక్త్వా కర్మఫలా సంగ్గం
నిత్యతృప్తో నిరాశ్రియః
కర్మణ్యభి ప్రివృత్తోఽపి
నైవకిం ఞ్చిత్కరోతి సః

తా॥— సర్వకాలములందును సంతృప్తి గలిగినవాడును ఆశ్రయరహితుడునై కర్మఫలములయందలి ఆసక్తిని విడిచి కర్మానుష్ఠానమునందు ప్రవర్తించినను వాడేమిచేయనివాడే యగును. అనగా తాను సద్గురుమూర్తికి కైంకర్య భావము చేత తను ధన మాన ప్రాణములర్పించిన వాడైనందున అహంరహితుడై తానేపనిని చేసినా తానేకోరిక కోరినా ఏమీ చేయనివాడేయగును. కాని బ్రహ్మవిద్య గురువుద్వారానే నేర్చుకొని సాధించవలెను. తనంత తానుగా తెలుసుకున్న విషయములు పరిపూర్ణముగావు.

ప్రజలు కోరికతోనే దేవాలయములోని దేవుళ్ళకు మ్రొక్కుకొందురు. పర్వదినములలో సముద్రస్నానం నదులలో స్నానం ఉపవాసములు, జాగరణలు, మూఢనమ్మకముతో చేయుదురు. అవికూడ కోరికలే కాని వారికోరికలు తీరక పోయినా బాధపడనివారు ధన్యులు.

ఒక చెట్టు బ్రతికి వుండగా దానినున్న ఒకకొమ్మను నరి కినయెడల ఆ కొమ్మచుట్టూ కొన్నికొమ్మలు గుబురుగా వచ్చుట అందరికి తెలిసిన విషయమే. అంటేమనకు అహము అనునది ఉండగా కోరికను బలవత్తరముగా చంపుకొన్న యెడల మరికొన్నికోరికలు మనకు తెలియకుండానే మొల కెత్తును. కోరిక తగ్గించుకొనవలయుననుట కూడాకోరికయే.

బైబిలునందు "తగ్గించుకొనువాడు హెచ్చింపబడును హెచ్చించుకొనువాడు తగ్గించబడును" అను సూక్తిగలదు తగ్గించుకొను ప్రయత్నము చేయువాడు హెచ్చించుకొను ప్రయత్నము చేయువాడు ఇద్దరూ అహము గలవారే. మానవులకు అణుకువ,శాంతము,భక్తి,జ్ఞానము,దయ అత్యంత అవసరము. అందుచేత ఈ గుణములు అలవరచుకొను టకు ప్రయత్నము చేయువారు తగ్గించుకున్నట్లు అందరకు కనబడును. అటువంటివారిపట్ల పరులెవ్వరికైనను గౌరవ భావము కలుగును. అదియే హెచ్చింపబడుట. హెచ్చించు కొనువాడు ధనము బలము యవ్వనము పదవి అందము మొదలైనవాటివలన నాతో ఎవరూ సాటిలేరని గర్వముతో విర్రవీగుటేతనకుతాను హెచ్చించుకొనుట. ఇటువంటివారిపై అసహ్యభావముకలిగి ప్రజలు దూరముగా వుందురు. వీరి నెవ్వరు గౌరవించరు.వీరికిఒక్కొకప్పుడు గర్వభంగములు

కూడా కలుగును. దీనినే తగ్గించబడుట అందురు. ఇందు మొదటివిధానమునకు గౌరవభూషణ సత్కారములు రెండవ విధానమునకు తిరస్కారము అగౌరవములు కలుగును. మానవమనసుకు ఈ రెండింటియందు భావములు పుట్టును. అనగా భూషణ సత్కారములకు ఆనందించును. మరియు తనవారితో తనకు జరిగిన సత్కారములగురించి చెప్పుకొని ఆనందించుచు, పొంగిపోవుదురు. దూషణ తిరస్కారములకు కృంగిపోవుట, మండిపోవుట జరుగును. అందుచేత ఈ రెండింటి యందు అహమున్నది, తగ్గించు కొనుటగాని హెచ్చించుకొనుటగాని కోరికలేయగును. తానుండి [ అనగా అహముతో నుండి ] ఏనిర్ణయము జేసినను కోరికయే

లోకవిరోధమయిన పరుల ఆస్తిని కాజేయుట పరస్త్రీలను చెరబట్టుట హత్యలు జేయుట మొదలైనవి కోరికలలోలెక్కకు రావు. అవి క్షణికోద్రేకపూరితములు. క్షణకాలము ఆలోచించి సాత్వికముగా వుంటే ఆవుద్రేకములు వాటికవే నసమసిపోవును.

సంసారి తన సంసారములోని యీతి బాధలకు తట్టుకొనలేక సన్యాసి కావలెననుకొనుటగాని సన్యాసి తనఒంటరి తనము భరించలేక దేహ బాధలకు తట్టుకొనలేక సంసారి కావలెననుకొనుటగాని కోరికలే అగును.

భగవద్గీత, కర్మయోగమునందు 8 వ శ్లోకము

శ్లో॥ నియతం కురు కర్మత్వం
కర్మజ్యాయో హ్యకర్మణః
శరీర యాత్రాऽపి చ తే
న ప్రసిద్ధ్యే దకర్మణః

తా॥ కర్మను వదలుట కంటే దానిని యొనర్చుటయే యుత్తమ మార్గము, కర్మను మానినచో నీకు దేహయాత్ర యైనను లభించదు సుమా! సంసారికి అచలగురుని ద్వారా అహమును రహితము జేసుకొనుటకు సులభ సాధ్యము. ఏలననగా సన్యాసికి కొన్ని సంసార సుఖములు తెలియవు. కనుక అవిఎట్లుండునో అనేతలంపు అప్పుడప్పుడు కలుగక మానదు. ఎప్పుడైనా అటువంటివి అందుబాటులోనికి వచ్చినపుడు ఎటువంటి సన్యాసి యైనను తలక్రిందులగుట తప్పదు. అలనాడు విశ్వామిత్రుడు ఘోర తపస్సులో నుండగా మేనక వచ్చుట మేనకను జూచినప్పుడు విశ్వామిత్రుని మనస్సు చలించి ఆమెను మోహించి అనుభవించి మేల్కొనినాడు. [ ఆకారణము చేతనే శకుంతల గాథ యేర్పడినది ] ఇంతటి తపశ్శాలికే మనోచాంచల్యమున్నపుడు మిగిలిన సామాన్యుల గురించి వేరేచెప్పనవసరంలేదు.

ఇటీవల ఒకబ్రహ్మచారి రామకృష్ణ పరమహంస పరమ భక్తుడు 50 సంవత్సరముల వయసు వరకూ అతినిష్ఠా

గరిష్ఠుడై భక్తి శ్రద్ధలయందు తేలియాడుచు "స్త్రీలు మోక్ష పథమునకు ఆటంకమని గట్టిగా వాదించేవారు. రామకృష్ణ పరమహంసగారి మతానుసారము స్త్రీలయందు అటువంటి భావము కలింగిచుకొనుచు ఉండెను, కొంతకాలము తరువాత తన అవసరార్థము అనగా తన యింటి పనులు వంటపనులు చేయుటకు ఒక వితంతువును. నియమించుకొనెను. ఆమెకు ఒకకుమార్డు కూడా కలడు. రానురాను ఆస్త్రీయందు వ్యామోహము కలిగి భక్తుల సమక్షములో ఆమెను వివాహము చేసుకొని సంసారియైనాడు, ఆయన యెవరోకాదు మాకు బంధువే, పేరు కీర్తిశేషులు ఒడుగు రామజోగి. ఆంధ్ర బ్యాంకు కాషియర్‌గా పనిచేసి రిటయిరయి తాడేపల్లి గూడెంలో కీర్తిశేషులైనారు.

కనుక సన్యాసులలో కొందరు ఇదేరీతిగా నుందురనుటకు సందేహములేదు. అనగా శారీరకముగా దృఢముగానున్నను మనస్సులో ఎప్పుడో ఒకకప్పుడు చలించకమానదు. కాని అతి ప్రేమానురాగములతో గడిపిన దంపతులలోని భర్త వివాహమైన ఒకటి రెండు సంవత్సరములోనే చనిపోయిన తరువాత జీవితాంతము వరకు బ్రహ్మచర్యముతోనే కాలము గడిపిన కొందరి స్త్రీల బ్రహ్మచర్యము వర్ణింపరానిది. ఇటువంటి బ్రహ్మచారులు మగవారిలో చాల తక్కువ మంది వుండును. పై స్త్రీలకు మనసు చలించదు అనుటలో సందేహములేదు.

కనుక సమస్త సుఖదుఃఖ సాగరమనెడి సంసారములో మునిగితేలుచున్నవారికి ప్రకృతి విషయములు అందలికష్ట సుఖములుఎట్లుండునో అని వేరే తెలుసుకోనవసరములేదు, ఇంతటి సాగరము నుండి బయటపడుట కూడ కష్టసాధ్యమే. అయిననూ అది సంసారికి అచలగురుని కరుణా కటాక్షము వలన అతి సులభసాధ్యము.

కోరికలు తగ్గించుకొనుట అనునది. ఒకచెట్టు కొమ్మను నరికినచో దాని చుట్టూ మరికొన్ని కొమ్మలు వచ్చుచునే యుండును. దాని తల్లి వేరును తరలించినచో ఆచెట్టు, చెట్టు నున్న ఆకులు పువ్వులు కాయలు సమస్తము నశించును. అట్లే అహం అనే తాను నశించినచో తనసమస్తమునశించును. అదే భ్రాంతిరహితము అనగా తాను లేనపుడు తనవారుతన కోరికలులేవు, పాపములు లేవు పుణ్యములులేవు సుఖములు లేవు దుఃఖములులేవు. ఇది అహంరహితమైన స్థితినిపొందిన ఆరూఢులకే తెలియక తెలియును. కనుక వారి దయను పొంది అహం అనే తల్లి వేరును అచల గురుని సహాయముతో తీసివేయవలెను. అదే కోరికల నిర్మూలన.

# అచలసాధన సోపానము

## సగుణారాధన - నిర్గుణారాధన

సగుణారాధన అనగా విగ్రహారాధన. అనగా మానవుని చేత చేయబడిన మట్టి, లోహము, రాయి మొదలగు వాటితో తయారుచేయబడిన విగ్రహములుగాని కాగితముపై వేయబడిన చిత్రములలో తనకు ఇష్టముగల దేవుని యొక్క ఆకారములో నున్న దానిని దైవముగాను, ఆదైవముఅక్కడే వున్నట్లు, ఊహించుకొని ఎవరి ప్రమేయము ఎవరి ప్రబోధము లేకుండగా నిశ్చలమైన భక్తితో పూజించుట సగుణారాధన అనబడును.

సగుణారాధకులలో చాలమంది పురాణములలో చెప్పబడిన వినాయకాది 33 కోట్ల దేవతలలో తమకు తెలిసినంత వరకు ప్రతి దేవుని ప్రతి దేవతను పూజించెదరు. అంతేకాక పశుపక్ష్యాదులను జంతువులను, సర్పములను, చెట్లను సూర్య చంద్రులను నవగ్రహములను పూజించెదరు. హిందువులు చాలమంది ఇతర మతములకు సంబధించిన దేవుళ్ళనుకూడ పూజించెదరు. వీరికి ఏదేవుని యందును ప్రత్యేకమయిన భక్తి ఉండదు. ఏదేవాలయమునకు వెళ్లితే ఆదేవుని పూజించెదరు. పర్వదినములయందు నదులలోను ముద్రములలో స్నానములు చేయుదురు. మరియు ఉపవాసములు చేయుట, రాత్రి జాగరణలు చేయుట భక్తిపార

వశ్యము. భజనలు, నృత్యములు చేయుట వీరికి భక్త్యా నందము నిచ్చును. పురాణ పఠనము పురాణశ్రవణము చేయుదురు. హరికథలు విందురు. ఆవిధముగా పురాణము వగయిరాలు విన్నపుడు తాత్కాలికముగా మనస్సు ప్రశాంముగా వుండి తానుకూడా పురాణ పురుషులవలె కావలెనని భక్తి ముక్తి మోక్షము యందు కోరిక కలుగును. దీనినే పురాణ వైరాగ్యమందురు. పురాణ కాలక్షేపము అయిన తరువాత ఇంటికి చేరిన వెంటనే పురాణములో విన్నవిషయ ములు గుర్తుకురావు. తన సంసారమును యథావిధిగా సాగించుకొంటూ ఎవరిమనస్తత్వముతో వారుందురు. అట్లే శ్మశాన వైరాగ్యము. అనగా ఎవరైనా చనిపోయినపుడు తానుకూడా స్మశానమునకువెళ్ళి అంత్య క్రియలు యథా విధిగా జరుపుచుండగా చూచి ఎంతటి వారైనను మట్టిలో కలసిపోవలసినదేకదాఅంటూవైర్యాగముతోమాట్లడి అక్కడ అంత్యక్రియల అనంతరము స్నానములు ముగియించు కుని ఇంటికి వచ్చినతర్వాత వైరాగ్యమంతరించి మామూలు ధోరణిలోనికి వత్తురు. భక్తి అనునది మనస్సుకు పట్ట వలెనుగాని ఇటువంటి పురాణ స్మశాన వైరాగ్యములతో వుపయోగములేదు. సగుణారాధనచేయువారిలో ఎక్కువ మంది ఆపద మొక్కులు మొక్కెదరు తీర్థ యాత్రలు చేయుదురు. యజ్ఞయాగాదులు చేయుదురు. భక్తివిషయము

ఎవరు ఏసలహా యిచ్చినా దానిని తప్పక పాటింతురు. కాని వితావక్షజ్ఞానము తక్కువగా యుండును. కారణము భక్త్యావేశము మరియు కోరికయొక్క తీవ్రత.

మెహర్‌బాబా భక్తులు, హరినాధ్‌బాబా భక్తులు, జిల్లెళ్ళమూడి అమ్మ భక్తులు, శిరిడి, సత్యసాయి బాబాల భక్తులు తదితర హిందూ మతమునకు సంబంధించి విగ్రహములను పూజించు భక్తులు తదితర మతస్తులు, సగుణారాధకులే. అనగా దేవుడు ఒకడు ఉన్నాడని ఆదేవునికి ఒక ఆకారము ఉన్నదని పూజించు వారందరు సగుణారాధకులే. వీరు నరకలోకము స్వర్గలోకము వేరువేరుగా ఉండునని నమ్ముదురు.

నిర్గుణారాధన :- సగుణారాధనలో అనుభవమును సంపాదించిన తర్వాత వారికి ఏరూపమైనను దేవుడొక్కడేయని నమ్మకము కుదిరిన వారుఒకదేవుడు అన్నిరూపములుపొంది యున్నాడని అందుచేత ఆయనకు రూపములేదని దేవుడు ఒకేచోటున అనగా గుడిలోను లేక పూజామందిరములోను ఉన్నాడనే వెర్రి నమ్మకమును పోగొట్టుకొందురు. మరియు ప్రహ్లాదుడు "ఇందుగలడందులేడని సందేహము వలదు" అనే పద్యములో చెప్పినట్లు లోకమంధంతట దేవుడున్నాడని నమ్మకము కలుగును. కొంతమంది ఇతర గురువుల ద్వారా ఆపోజ్యోతి బ్రహ్మ స్వరూపమని, నిశ్శబ్ద బ్రహ్మమని,

ఆనందమే బ్రహ్మమని, అహం బ్రహ్మాస్మి అని, హంసను సహస్రారమందు నిలిపి బ్రహ్మ స్వరూపమును జూడవలె ననియు విని ఆవిపెధరీతులననుసరించుటకు ప్రయత్నింతురు

శరీరముతో ఏమిచూచినను శరీరము మాయాస్వరూపమే కనుక కనిపించేది మాయయే అగును, కొంతమంది తనకు భగవంతుడు ప్రత్యక్షమయినాడని ఆయనతో మాట్లాడినానని సగుణారాధకులు చెప్పుకొనుమాటలుకూడ మాయా సంబంధమైనవే. ఉ;- ఒకరు తమ పుత్రుని అత్యంత ప్రేమతో అతడే సర్వస్వమనేతలంపుతో పెంచుచుండగా అతడుచిన్న వయసులోనే చనిపోయిన యెడల ఆపేర్రిమ ఉన్మాదముగా మారును. ఆస్థితియందు తనకుమారుడు చనిపోయినట్లు వారికి అనిపించదు. కనుక వారు ఆకుమారునితో మాట్లాడుతూ ఆడిస్తూ ఆహారం తినిపిస్తూ వున్నట్లుగానే వారికి తోచును. వారికి ఆకుమారుడు కనిపించుట మాయయేగదా అదేస్థితిలో మహాభక్తులు సగుణారాధనలో ఒకేరూపమును నిర్ణయించుకుని దానిపైనే లక్ష్యము పెట్టుకొని అపరిమితమయిన భక్తి శ్రద్ధలతో పూజించువారి స్థితి ఉన్మాదస్థితికి పోవును అదే తన్మయత్వస్థితి. ఆ తన్మయత్వంలో అట్టి అచంచలమైన భక్తియందు తాను యేరూపముపై లక్ష్యముంచుకొనినాడో ఆరూపము తనదగ్గరకు వచ్చినట్లు మాట్లాడినట్లు జాగ్రతా

వస్తువయందును, స్వప్నావస్తయందును కూడా వుండును. అందుకు సందేహము లేదు. ఇది అంతయు మాయా ప్రభావము. ఇట్టి స్థితిలో వారికి కొన్ని మహిమలు కూడ సంక్రమించును. ఆమహిమలు వారికి తెలియవు అనగా భక్తి అనుశీర్షికలో భక్తివలన తనకు తెలియని శక్తి వచ్చునని తెలుసుకొని యున్నరు.

ఎన్ని మహిమలున్నను శ్రీకృష్ణుడు జన్మరాహిత్యము కొఱకు మాయారహితము భ్రాంతిరహితము అహంరహితము చేసుకొనుటకు అచల సాంప్రదాయుడైన సాందీప మహర్షి శిష్యుడై తరించినాడు. కనుక సామాన్యులగూర్చి వేరే చెప్ప నక్కరలేదు.

కాబట్టి సగుణ నిర్గుణాతీతమయినట్టి స్థితిని పొందుటకు అచల సాంప్రదాయగురువును వెదకి పొందవలెనను కుతూహలము రానురాను అట్టి వుత్కృష్టమయిన స్థితిని పొందు కాలమాపన్నమైనపుడు దానంతట అదేకలుగును.

# అచలసాధన సోపానము

## కైంకర్యము - నిజస్థితి

కైంకర్యముఅనగా సమర్పణము. సగుణ నిర్గుణారాధనల కతీతము సగుణ నిర్గుణారాధనలు తానుండి వేరే దైవమును పూజించుట. కైంకర్యముట్లుగాదు.

అచల గురువు నాశ్రయించి, ఆయన ఆదేశానుసారము తెలివిసాధారముతో ఆయనే బ్రహ్మ విష్ణు మహేశ్వరులని భావించి ఆయనకు తను ధన మానప్రాణములర్పించి తిరిగి వాటిని దొంగిలించనని ఘోర ప్రమాణము చేసి ఆయన ఇచ్చిన మంత్రములను పఠించవలెను. ఆయన పట్ల తైలధారవంటి నమ్మిక కలిగి అనగా ఎడతెగని (అప నమ్మికలేని) స్థితి గలిగి పూజించు చుండవలెను. మీస్థితిమీకు అర్థమైనవెంటనే మీరు అర్థము చేసుకొనుటకు ఆధారమైన తెలివికూడ శరీరములోనిదేననే నిర్ధారణ గలిగి, శరీరమందు తెలివితో సహా సర్వ స్వతంత్రమును (మీకు తెలియకనే) గురువర్యులకు సమర్పించుకొనుట కైంకర్యమనబడును. అదే సాష్టాంగ నమస్కారమునకు అర్థము.

శబ్ద స్పర్శ రూప రసగంధములు ప్రకృతి జన్యములు. దీనికి అతీతమయినది దైవము. అదే పరిపూర్ణము అదే బట్టబయలు. అనగా పంచతన్మాత్రలు లేనిది. ఒకప్పుడు పుట్టనిది చావనిది. ప్రపంచమంతటను లోపల వెలపల నిండి

దేని యాధారములేక స్వప్రకాశ రహితమై స్త్రీకాక పురుషుడుకాక నపుంసకుడుకాక వున్నది దైవము. ఆ స్థితినీకు కైంకర్యము వలన సంప్రాప్తమగును. ఆస్థితిలో నాకిది సంప్రాప్తమైనదనిగాని ఉన్నాననిగాని లేననిగాని ఉన్నానో లేనో అనే భ్రాంతులు నిర్మూలమగును.

మధ్యమధ్యలో అనగా జీవితకాలములో సందేహములు వచ్చుట సహజము. అంటే పైస్థితి తనకు అర్ధముకాలేదని అపుడు రూఢిగా తానున్నాడని తెలుసుకొనవలెను. ఈస్థితి సద్గురునియందు సరియైన లక్ష్యముకుదరకపోవుటే అగును.

ఇటువంటిస్థితి త్రేతాయుగమునందు జనకునకు కలిగెనని చెప్పెదరు. అది యెట్లనగా :- జనకుని గురువు యాజ్ఞవల్క్యుడు. జనకుడు చక్రవర్తి అతనికున్న రాజసమువలన తనస్థితి కుదరక నాకు'నేనెవరిని' అనే సందేహమున్నది. అది తీర్చినవారికి బహుమతినిచ్చెదనని తీర్చనివారికి కారాగార ప్రాప్తి అనిచాటించెను. అతని సందేహము "నేనెవర్ని? " దానిని తీర్చుటకు చాలమంది వచ్చి అయన సందేహము తీర్చలేకకారాగారములో చేరినారు. కొంతకాలము తరువాత ఆ కారాగారములో నున్న ఒక పండితుని కుమారుడు అష్టావక్రుడు తన విద్య పరిపూర్ణతచెందిన తరువాత గురువు ఆశీస్సులతో ఇంటికి చేరగానే తనతండ్రి కారాగార ప్రాప్తి

గురించి తెలుసుకొని తల్లిని "అమ్మా నాన్నగార్ని తీసుక్క వస్తాను నన్నాశీర్వదించమని కోరగా తల్లికుమారునికి కూడా కారాగార వాసమేర్పడునని భయపడి కుమారుని కోరిక మన్నించలేకపోయినది. కుమారుని పట్టువిడువక పోవడం వలన పత్ని సరిగా కుమారుని ఆశీర్వదించి పంపించినది. ఆ అష్టావక్రుడు జనకుని కొలువుకు చేరి మీ సందేహము నేను. తీరుస్తాను. తీర్చినవెంటనే కారాగార ములో నున్న వారినందరిని విడిచి పెట్టవలెనని సందేహము తీర్చలేనియెడల తామకూడా కారాగారములో చేరెదనని చెప్పగా జనకుడుసరే నన్నాడు. అష్టావక్రుడు ఒక చక్కని గుర్రానికి జీను అమర్చి తీసుకురమ్మని చెప్పగా రాజాజ్ఞచేగుర్రము సిద్ధము చేయుబడినది. జనకునితో మీగురువుకు తను ధన మాన ప్రాణ ములు ధారాపోసినారాఅని అష్టావక్రుడు అడగగా అలాగే ధార పోసినానని. చెప్పెను అట్లయిన ఇదిగురువాజ్ఞ గుర్రాన్ని ఎక్కమన్నాడు. జనకుడు మొదట కాలును రికాబులోనుంచి పైకి ఎగయుచూ రెండవ కాలును గుఱ్ఱము ఆవలి రికాబు పైపుకు సారించగా వెంటనే ఆగమని నీవు గుఱ్ఱము మీద కూర్చొనవద్దు అవతలిరికాబులో కాలు పెట్టవద్దుఇవతలిరికాబులో కాలుంచి అటులనే ఉండిపోవలెను ఇది గురువాజ్ఞ అనిచెప్పి అక్కడనుండిఅష్టావక్రుడు వెళ్ళిపోయెను. ఇంతలో జనకుడు నా తను ధన మాన ప్రాణములు నాగురువుకుధారవోసినాను

గదా ఆవిధముగా శబ్ద స్పర్శ రూప రస గంధములు లేని నాకు సందేహ మెక్కడిది? అని తనలో తాను సమాధానము పొందెను. తరువాత అష్టావక్రుడు తిరిగివచ్చి నీ సందేహము తీరినదా అని అడగగా తీరినదని జనకుడు చెప్పగా దిగమని చెప్పినాడు. అంతటితో కారాగారములో నున్న వారినందరిని విడిచిపెట్టగా తనతండ్రిని తీసుకుని అష్టావక్రుడు ఇంటికి పోయి తల్లిని ఆనందపర్చినాడు.

అందుచేత సద్గురుని చేరిన శిష్యులకు సందేహము తీరక పోయినపుడు తరుచుగా గురుని దర్శించి గురుసేవ చేయు చుండవలెను. గురువు చెప్పిన విషయమే మరల మరల చెప్పుచున్నాను దేహాభిమానము పూర్తిగా పోయేవరకు అర్ధ మవదు దేహాభిమాన మే గొప్ప జబ్బు. ఆ జబ్బు తీరేమార్గ మే కైంకర్యము. అదే సందేహ రహితము, భ్రాంతి రహితము అదే స్వదృష్టి. ఆస్వదృష్టిలో నున్న వారికి ఆస్థితి సులభ సాధ్యము.ఆస్థితిలో నీవుగాని నీసుఖదుఃఖములుగాని నీబంధు మిత్రుల చావు పుట్టుకలుగాని యేమాత్రము గోచరించవు. ఈ స్థితి ఒక్కసారిగా రాదు, సాధన చేయుగా చేయుగా సద్గురుని కరుణా కటాక్షమువల్లనే కుదురును.

దేహవాసన అనగా దేహాభిమానము, అనగా తనకుజరుగు భూషణ దూషణ తిరస్కారములు సుఖదుఃఖములు తనకు

కలిగినట్లు భావించి అనుభవించుట. అట్టి వారికి కైంకర్య భావము కుదరదు.

శాస్త్రవాసన అనగా పురాణములు, శాస్త్రములు, మొదలైన వాటిని చదివి, లేక విని సగుణ నిర్గుణారాధన ప్రభావముగలిగి 33కోట్ల దేవతలు వారిస్థితి నిజమనినమ్ముచు స్వర్గనరకములున్నట్లు భావించుచు పాప పుణ్యములు సరి జూచుకొనుచు శాస్త్రములు చెప్పిన రీతిని నడుచుకొందురు. అటువంటి వారికి తమ నిజస్థితిని పొందుట చాలకష్టము దీనియందు నమ్మకము కుదురుట కష్టము. దీనివలన అనగా శాస్త్రవాసన, దేహవాసన వలన నిజ గురువర్యులను దైవ ముగా పూజించలేరు గురువునకు సాష్టాంగ నమస్కారము చేయలేరు. గురుపాద తీర్ధము సేవింపలేరు. గురుని భుక్తి శేషము భుజించలేరు.

గురువునకు త్రికరణశుద్ధిగా తను ధన మాన ప్రాణములు ధారవోసి పైవిధముగా ఎవరు ఆచరించినను, వారి దేహ వాసన శాస్త్రవాసన వాటంతట అవే నశించును. అట్లాచరించి నను దేహాభిమానము నశించక శాస్త్రములందు నమ్మిక నశించకపోయిన యెడల వారు తిరిగి జన్మించుటతప్పదు.

దేహభిమానమే పెద్దరోగము. ఆరోగము పోవుటకే గురు సేవ చేయువలెను. అదే కైంకర్యము. గురువర్యకూడ ఆయన గురువర్యులకు కైంకర్యము చేసినవారు కనుక గురుశిష్యుల స్థితి ఒకటే వస్తువగును. అదే దైవస్వరూపము అదే సమస్త జీవుల సమస్త ప్రపంచము యొక్క నిజస్థితి.

# అచలసాధన సోపానము

## అహము గలవారు అహము లేనివారు

అహమనగా త్రిగుణమనే సత్వరజఃతమో గుణములు గలది. అదేనేను అనునది అదేమాయ అదే ఎరుక అదే ప్రపంచము. ప్రపంచమంతయు నేను(మాయ)చేత అవరింపబడి, మనుగడ జరుగుచున్నది. నేను అనేక రకములుగా అనగా తల్లిగాను తండ్రిగాను అత్త మామ కొడుకు కోడలు కూతురు అల్లుడు తాతయ్య అమ్మమ్మ నాయనమ్మ మనుమడు,మునిమనుమడు, ఈవిధముగా ఎన్నో అవతారములు యెత్తినా "నేనే" కారణం. అదే అహం. అహంజన్మకు కారణమగును కనుక ప్రతి జీవిలోను అహమున్నది. అది ప్రకృతి సహజము.

ప్రతి మానవునకు చిన్న వయసు నుండి నేను నాది అనునది అలవడును. ఎంత చిన్నవాడికైనా ఒక వస్తువును చూపించి ఇది ఎవరిది? అని ప్రశ్నిస్తే "నాది" అనును నీదికాదంటే ఏడ్చును. నీవు మంచివాడవంటే ఆనందించును నీవు మంచివాడవు కావంటే యేడ్చును.

పెద్దవారుకూడా వారు చేయు పనులు పరులకు చూపి మెప్పు పొందుటకు ప్రయత్నించెదరు. వారి ఆస్తిపాస్తుల యందు అత్యంత మమకారము చెంది తనకు కావలసినది సరిపడినంతవున్నప్పటికి ఇంకనూ ఎన్నోరెట్లు సంపాదించవలెనని తీవ్రమయిన ప్రయత్నములు చేయుచుందురు. లాభించిన ఆనందింతురు. నష్టపోయినబాధపడేదరు.కొందరు

సంపాదనకు వక్ర మార్గములను కూడా అనుసరింతురు. ఈ విధముగ అలవాటుపడినవారు అవసాన కాలమందు కూడా వారి ఆస్థిపాస్తులయందు ఆలుబిడ్డల యందు మమకారమును పోగొట్టుకొనలేరు. ఈ జీవితము ఈ ప్రపంచము అశాశ్వితమని గ్రహించలేరు. గ్రహించినా అలవాటును తప్పించుకొనలేక నా బిడ్డలు నా ఆస్థి అంటూ అతి కష్టం మీద ప్రాణములు విడిచిపెట్టెదరు. అదే ప్రకృతి మహత్మ్యం అహముతేని యెడల పకృతి లేదు జననమరణములులేవు. అందుచేత మానవులందరు అహముగలవారే అట్లే అన్ని మతములలోను అహమున్నది.

అచల సాంప్రదాయులలో అహముండదు. ఆస్థితి కైంకర్యము వల్లనే వచ్చును. కాని పైకి అహముగలవారి వలెనే కనబడును. ఉదా :— చెల్లు వ్రాయబడిన ప్రామిసరినోటు వంటిది. అనగా ప్రామిసరి నోటుకు వెనుక చెల్లు వ్రాయక పోతే (దానికి అహముండును) దానికి విలువ యుండును. దానివెనుక చెల్లువ్రాసిన యెడల పైకి అదిమామూలు ప్రామిసరినోటువలెకబడును. కానిదానికి విలువ యుండదు. అది ఎవరివద్ద నున్నను చెల్లదు. అట్లే అచల సాంప్రదాయులు లోక వ్యవహారము లౌకిక వ్యవహారములో అహమున్నట్లు కనబడిననూ వారిఅహము వేరై యుండును. కాని అచల సాంప్రదాయులలో కొంతమందికి ఈ విషయము పూర్తిగా అర్ధముకాక గురునియందు సరియైన కైంకర్యభావము

లేనివారు పైకి డాంబికముగా కనబడినను వారి జీవితము మామూలే. ఆస్థితిలో వారిని వారు మోసగించుకుంటూ నమ్మిన వారిని కూడా ధనము కొఱకు మోసగించెదరు. వీరికి దేహాభిమానము వీడదు

అచల సాంప్రదాయులలో సద్గురునియందు త్రికరణశుద్ధి గలిగిన కైంకర్యభావము గలవారికే దేహాభిమానముండదు. అదే అహం రహితం. వారు అహమున్నట్లు కనబడిననూ దానికి పట్టుదలలేదు. విలువలేదు. అదిచెల్లదు దాని వలన పునర్జన్మమున కవకాశములేదు. లోక వ్యవహారము కొరకు వీరు నేను నాది అనవలసి యుండును. కానిదానిలో అహము పట్టుదలలేదు.

భగవద్గీత గుణత్రియ విభాగము. 20వ శ్లోకము

శ్లో॥ గుణానేతా నతీత్యత్రీన్
దేహీ దేహ సముద్భవాన్.
జన్మ మృత్యు జరాదుఃఖై
ర్వి ముక్తో ఽ మృత మశ్నుతే

**తా॥** త్రిగుణా తీతునికి చావుపుట్టుకలు లేవు. దేహధారియగు వాడు దేహ సముద్భవములగు యీ మూడు గుణములను అతిక్రమించిన యెడల జన్మ మృత్యుజరా దుఃఖముల నుండి విముక్తుడగుచున్నాడు.

అనగా ఓంకారము నుండిత్రిగుణములనెడి సత్వ రజస్తమో గుణములు గలిగినవి. అవే కతృత్వమునకు

( అహమునకు ) కారణము. వాటిని నిర్మూలించు కొనుట ఎవరికి సాధ్యపడదు. కేవలం సద్గురుని కృప కరుణారసముల వలన సద్గురునికి త్రికరణశుద్ధిగా తను ధన మాన ప్రాణము లర్పించినవారికి త్రిగుణములులేవు వాటికి సంబంధించిన అహములేదు. ఆస్థితిలోనే జన్మమృత్యు జరాదుఃఖముల నుండి విముక్తుడై ముక్తిని బొందును.

ఈ విధముగా ఈ క్రింది వారికి అహములేదు.

జనకుడు రాజ్యమేలుచు, ప్రజలనుచక్కగ పాలించుచు యాజ్ఞవల్క్యుని శిష్యుడై అచల సాంప్రదాయుడై అదే సాంప్రదాయుడైన ధర్మవ్యాధుడనే మాంసము అమ్ముకునే వాని యింటికి మారువేషమున వెళ్ళి ఆయన అచలబోధను విని వచ్చుచు తన సంసార ధర్మమును తాను నిర్వర్తించు చున్ననూ వాని యందు అహములేదు. శ్రీకృష్ణుడు అష్ట భార్యలతో తులతూగుతూ దుష్ట శిక్షణ శిష్టరక్షణ మొన ర్చుచు మహాభారత కురుక్షేత్ర యుద్ధ మందు ఎన్నియో మాయోపాయములచేత ఎందర్ని హతమార్చినను కొందరిని రక్షించిననూ సాందీపమహర్షియనే అచల సాంప్రదాయగురు వర్యుని యొక్క శిష్యుడై వారి ఆదేశానుసారము ఉపదేశము పొంది అహం రహితము చెందినాడు. మరియు అర్జును నకు భగవద్గీతను బోధించినాడు. అయినను ఆయనయందు అహములేదు. నా గురువర్యులైన శ్రీమద్గంగిపాముల

శ్రీరామచంద్ర యోగీంద్రులవారు సంసారము చేయుచు అచల సాంప్రదాయ గురువర్యులైన శ్రీ మద్వీను కొండ నరసయార్యుల వారి శిష్యులై ఇల్లువాకిలి పొలము వ్యవసాయముచూచుకుంటు వున్నప్పటికి ఆయన యదార్ధస్థితికి సంసారముండుట లేకుండుటనెరుగరు. వారు అహంరహితులు

# అచలసాధన సోపానము

## నిజస్థితి - తెలివి

లోకమునగల సమస్త జీవుల, చరాచర వస్తువులయదార్ధ స్వరూపము దైవము అదే అచలము. బట్టబయలు, పరిపూర్ణము. ఈస్థితి ప్రపంచమందంతట లోపలవెలుపల అండ పిండబ్రహ్మాండ మంతయు నిండి స్వప్రకాశ రహితమై దేనియాధారములేక ములుగుబ్బు సందులేక చావుపుట్టుకలు లేనిదై యున్నది. దీనికి శబ్ద,స్పర్శ,రూప,రసగంధములనే పంచతన్మాత్రలు ఉండుటగాని లేకుండుటగానిలేదు.

సమస్త జీవులు ముఖ్యముగా మానవులు ప్రకృతి జన్యమయిన అశాశ్వితమయిన యీ శరీరమునుతనలోగల తెలివి వలన తనదేనని గట్టినమ్మకముగలిగి ఆశరీరమునకు పెట్టుకొన్న నామము తనదేనని తనకున్న స్థిరచరాస్తులు భార్యపుత్రాదులు, తనవేనని యీ లోకము స్థిర మేనని గట్టిగా

నమ్ముదురు. అహముతో మమకారమునకులోనగుచు త్తుధకు తనకు తననిజస్థితిని తెలుసుకొనకుండగనే చనిపోవుచు తిరిగి పుట్టుచూవుందురు.

ప్రకృతి జన్యమయిన,శుక్లశోణితముచే యేర్పడిన యీ శరీరమునకు తెలివి ఉన్నది. దీనిప్రభావముచేతనే అహము మమకారము ప్రబలుచున్నది. తన యదార్ధస్వరూపము యీ మాయా శరీరముకాదు. సర్వత్ర నిండియున్న భగవత్స్వరూపమని సగుణ నిర్గుణారాధకుల కెవ్వరికిని తెలియదు. ఎట్లనగా ఒక వ్యక్తి తనపేరు 'వెకంటగిరి' అయియుండగా అతనికి "మహాదేవి"అను దయ్యము పట్టినదను కొందము అపుడా వెంకటగిరి తనపేరు "మహాదేవి' అనియే చెప్పుకొనును కాని వెంకటగిరి అనిమాత్రము చెప్పడు. అట్లే మన యదార్ధ స్వరూపము త్రిగుణ రహితమై శబ్ద స్పర్శ, రూప, రసగంధములేని. దైవస్వరూపము దానికి యీ మూలములేని గుర్తెరిగే శరీరము అనే దయ్యముపట్టి దీని యందున్న అహముగల తెలివితో యిదేనేను అనుకొనుచు తన స్థితి తనకుతెలియక మాయా సంసార సముద్రములో పడికొట్టుకొనిపోవుచు. చచ్చుచు పుట్టుచున్నారు. వెంకటగిరికి భూత వైద్యునిచేత భూతవైద్యము చేయించగా ఆ 'మహాదేవి' అనే దయ్యము వదలిపోగానే తనపేరు వెంకటగిరి అని

చెప్పెను. అట్లే అచలగురువు మనకు వుపదేశము చేసి మన యొక్క తను,ధన,మాన ప్రాణములనెడి పంచతన్మాత్రలు తానే దానరూపమున స్వీకరించి యీశరీరమనే భూతమును నిర్మూలనము జేసి యీశరీరము మనదేననే భ్రాంతినిరహితము చేసిన వెంటనే మన యదార్ధమయిన స్వరూప మే దైవస్వరూపము మనదిగా తెలివి సహాయముతో స్ఫురించును. ఇదంతయు గురుని యందుగల తైలధారవంటి నమ్మికగలిగి సందేహములులేని మనసుగల వారికే ఆయన కరుణా కటాక్షముల వలనజరుగును. లేనియెడల ఎన్ని జన్మలనెత్తినను యదార్ధస్థితిని పొందలేరు. ఆయన అనుగ్రహముతో మన శరీరము సంసార సుఖదుఃఖములు,పాప పుణ్యములు మాయా ప్రపంచము మనది కానట్లు హృదయ గ్రంధి వీడి ధృడపడును. అదే యదార్ధస్వరూపము, నిజ స్థితి, శాశ్వతము, నిత్యము.

మరియొక ఉ॥దా- నీ ముఖ్యమైన వస్తువు ఉంగరము అనుకొనుము అది చీకటిలో పోయినది. అప్పుడు దీపపు కాంతి సహయముతో దానిని వెదకి ఆవుంగరమును నీవు చేతికి ధరించితివి. ఆతరువాత నీవుంగరము వెదకుటకు ఆదీవపు కాంతి నీకు అవసరములేదు గదా! కాని నీవు జీవించి

వున్నంతవరకు వేరేవిషయములు చూచుకొనుటకే ఆకాంతి అవసరము అట్లే. నీయదార్ధమయిన నిజస్థితి గురించి నీకుతెలియదు. దానిని నీవు పొగొట్టుకున్నట్లే అసలు ధాని విషయమే నీకుతెలియదు. అపుడు అచలగురుని ఆదేశానుసారము నీకున్న తెలివిఅనే కాంతి సహాయముతో నీయదార్ధమయిన నిజస్థితి నీవు గ్రహించిన తరువాత నీకు నీతెలివి అనే కాంతి నీనిజస్థితిని తెలుసుకొనుటకు అవసరముండదు. కానిఆతెలివి సహాయముతో శరీరము తన పూర్వజన్మ కర్మ ఫలమునను సరించి తన పనులు తాను చేసుకొని లౌకిక వ్యవహారములు చూచుకొంటూ చివరికి ప్రకృతిలో లయమగును.

ఆవిధముగా శబ్ద,స్పర్శ,రూప,రస,గంధములతో కూడిన ఈ శరీరమును గురువర్యునికి తెలివితో సహా కైంకర్యము జేసిన యెడల శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములేని భగవత్స్వరూపమనే నిజస్థితే నీవు. ఇందుకు సందేహములేదు ముమ్మాటికి అదే నీ యదార్ధస్వరూపము.

## అచలసాధన సోపానము
### ముముక్షత్వము

ముముక్షత్వమనగా మోక్షమునందు కోరిక. ఇది రెండు విధములు 1( మందమోక్షేచ్ఛ, 2) తీవ్రమోక్షేచ్ఛ.

మందమోక్షేచ్ఛ అనగా మనకు జీవితము చాలవున్నది. ఇంతచిన్న వయసులోనే భక్తికితొందరేమున్నది. సంసారము పిల్లలు మనుమలను చూచుకుని తర్వాత వృద్ధాప్యములో రామాకృష్ణా అనుకుంటెచాలు అనుకొంటూ భక్తి గురించి ఆలోచించక భక్తులను చూచినప్పుడు గాని అటువంటి భక్తి విషయములు విన్నపుడుగాని భక్తియందాసక్తి కలుగక మనసు సంసార విషయములలోనే వుంచెదరు. ఇదియే మందమోక్షేచ్ఛ.

ఇల్లుకాలిపోవుచుండగా నూతిని తవ్వినీళ్ళుతెచ్చి మంట లార్పుటకు ప్రయత్నము చేసినయెడల ఇల్లుకాలి మంటలు తగ్గి బూడిద మిగులును. మరియు వ్యవసాయము చేయు వారు అదనులో దుక్కిదున్నక విత్తులు చల్లక చేద్దాములే అనుకొంటూ అశ్రద్ధ చేసిన యెడల అదనుదాటి పంటలు పండవు. అట్లే మందమోక్షేచ్ఛగలవారికి భక్తియందు శ్రద్ధ కలుగురోజువరకు శరీరము జీవించియుండునని నమ్మకము లేదు. జీవితము క్షణభంగురము కాబట్టి మందమోక్షేచ్ఛ మానవులకు తగదు.

తీవ్రమోక్షేచ్ఛ : మోక్షము కావలెనని తీవ్రమయిన ప్రయత్నములో అహర్నిశలు దానియందే మనసులగ్నము చేసుకొనవలెను. జీవితము చాలచిన్నది. ఎప్పుడు జీవితము అంతమగునో తెలియదు. జీవితకాలములో ఏ అనారోగ్యము

సంభవించకముందు దీనిని సాధించవలెనని మిక్కలి దాహ ముగా నున్నవారు నీరు త్రాగునటుల, మిక్కిలి ఆకలిగా వున్నవార్లు ఆహారము భుజించునటుల భక్తియందాసక్తి కలిగి సద్గురుని వెదకి జీవన్ముక్తిని లేక పరిపూర్ణతను చెంద వలెను.

అదియునుగాక భక్తి చిన్నతనమునందే చక్కగా అంటు కొనును దానిని యెట్లయినను మలచుకొనవచ్చును. వృద్ధా ప్యమునందు మనస్సు జీవితములోని సుఖదుఃఖములతో వేగివేగి కాలినకుండ పెంకువలెనగును. దానిని ఏవిధముగాను మలచుకొనలేము. సంసారమునందు, తనవారియందును, అస్తి పాస్తులయందునూ. ఆసక్తి యెక్కువై రానురాను వృద్ధా ప్యముయెక్కువైనకొలది అది మరింత ధృడపడి అసలు మోక్షము కొఱకు ఆలోచించనేలేరు. అటువంటి సమయము కూడావారికి దొరకదు. అసలు చిన్నతనమునందే భక్తినిస్స దేహముగా అబ్బును. ఉ॥- ప్రహ్లాదుడు మార్కండేయుడ ధృవుడు శంకరాచార్యులు మొ॥వారు చిన్న తనమునం భక్తినలవరచుకొనిరి. కాబట్టి ప్రతిమానవునకు తీవ్రమోక్షేచ్ఛ అవసరము.

మానవ జన్మ భక్తినితెలుసుకొను స్వభావముగలది. ఇతర పశుపక్ష్యాదులు భక్తి తప్ప అన్నిపనులూ అనగా ఆహార సంపాదన ఆకలి దప్పులు తీర్చుకొనుట కామవాంఛ తీర్చు కొనుట పిల్లలను గనుట సాకుట పోషించుట గూళ్ళు కట్టు కొనుట మొదలైన వన్నియు మానవులకంటె మిన్నగా నెర వేర్చుకొనుచున్నను, భక్తియను మాట అజ్ఞానము వాటికి

సహజముగావుండవు. అంతటి మహాజ్ఞానము మానవశరీర
నందే కలదు. ఆటువంటి వుత్కృష్టమయిన జ్ఞానమువృ
చేసిన యెడల మానవులు పశుపక్ష్యాదులతో సమానమేక
అందుచేత ఈ జన్మలో దీనిని సాధించలేకపోయిన మా
జన్మ వృధాయగును. భక్తి లేనిమానవ శరీరము తగల
పోతున్నటువంటి ఇల్లువంటిది. అట్టి యింటినుండి బయ
వచ్చుటకు యెంతతీవ్రమయిన ప్రయత్నము చేయుదు
అట్లే మోక్షము సంపాదించవలెనను కోరిక కలిగి వయస్సు
నిమిత్తము లేకుండా చిన్నతనములోనే భక్తిని అలవరుచుకొ
నిజగురుని వెదకి అభ్యాసముచేసి తరించవలెను.

ముక్తి అనగా బంధవిముక్తి.బంధమనగా పూర్వజన్మ కర
ఫలితముగా పూర్వజన్మ సుకృతముగా వచ్చిన మానవ శ
రములో బంధింపబడుట. అట్లుయేర్పడిన శరీరమందు జీ
తిరిగికర్మల నొనర్చుచు తనఅహముపల్లతాను చేయు పా
పుణ్యకర్మలచేత తిరిగి బంధము గలిగి చచ్చుచూ పుట్టుచు
వుందురని పూర్వజన్మ కర్మఫలము అనుశీర్షికలో తెలుస
కొనియున్నారు. ఈస్థితినుండి అనగా పాపపుణ్య కర్మ
బంధము నుండి సద్గురుని కరుణాకటాక్షముల చేతనే బం
విముక్తి కలిగించుకొని జనన మరణములకతీతమైన శాశ్వ
మైనతన యదార్ధ స్థితిని తెలుకొనుటయే బంధవిముక్తి
జీవన్ముక్తి మోక్షము.

సమాప్తం

# శోభాపార్మాసీ - నరసాపురం వారి

**మహానంద్ :** దీనిని శిరస్సుమాడుకురాసిన తలనొప్పులు 5నిముషములలో పోవును.

నొప్పి వాపుగలచోట్ల వ్రాసిన అన్ని నొప్పులు వాపులు నయమగును. ఏఅవయవమైనను కదలలేని స్థితిలో దీనిని వ్రాసిన రక్తనాళములు పరిశుభ్రము చెంది అవయవము మామూ స్థితికివచ్చును. ఇంజక్షను గడ్డలపై రాసిన కరుగును. నొ నివారణమగును సెగ్గడ్డలపై రాసిన చిదికి నయమగు గోరుచుట్టుకు దట్టముగా రాసిన నయమగును. చప్పి సరిపి రెండుమూడు రోజులలో తగ్గును శీతాకాలపు చ కాయలు పెదవుల, కాళ్ళపగుళ్ళు నయమగును .స్త్రీలచన కుదురు నయమగును. చెవిలో కురుపు తగ్గును నడవలేని 5 సంవత్సరాలలోపు పిల్లలకు 2 నెలలు కాళ్ళు, చేతులకు మర్దనాచేసిన నడుచు శక్తివచ్చును. పంటికురుపు తగ్గును. గుండెనొప్పి ఊపిరినొప్పి నయమగును. కాళ్లు చేతులు లాగువారికి రాసిన 5 నిముషములలోతగ్గును. చాలకాలము నుండివున్న తలనొప్పులకు 9రోజులు 'సుఖజీవన్"వాడుతూ దీనిని శిరస్సుకు మాడుకు రాసిన నయమగును. కాయ కష్టము చేయువారలు రాసుకొన్న త్వరగానొప్పులుతగ్గును కొంకుదెబ్బలకు వెంటనే రాసిన నయమగును వరి బీజపు నొప్పులు నయమగును. చర్మవాద్యము చేతితో వాయించెడు చేతుల నొప్పులు నయమగును.

పశువులకు మహానంద్ : చనుకుదురు పేడపురుగు కుట్టినందు వలన వాచిన వాపులకు కాళ్ళ బెణుకులు పట్టినందువలన కలిగెడు నొప్పులకు మెడమీద వ్రణములు కీళ్లవాపులు నయమగును.

అచలసాధనసోపానము

# గ్రంథకర్త గురించి ....

| | | |
|---|---|---|
| జననము | ; | 4 ఆగష్టు – 1929 నరసాపురం |
| తల్లిదండ్రులు | : | కీ॥శే॥ పొన్నాల కనకమ్మ, సూర్య నారాయణగారు |
| విద్యాభ్యాసం | : | నరసాపురం |
| ఉద్యోగము | : | సంగీతోపాధ్యాయుడు, మున్సిపల్ అప్పర్ ప్రయమరీ బాలికల పాఠశాల (జమిందారు స్కూలు, స్టీమర్‌రోడ్ నరసాపురం) |
| రచనలు ముద్రితాలు | ; | సూక్తిమాల, మనసులోని మాట |
| అముద్రితాలు | : | మేలుకొలుపు, నాదేశము, స్త్రీస్వాతంత్ర్యము, హార్మోనియంబోధిని |
| అభిరుచులు | : | వైద్య, సంగీత, ఆధ్యాత్మిక విషయము, భ్రాంతిరహితమార్గము |
| గురువు | : | శ్రీ మద్గంగిపాముల శ్రీరామచంద్ర యోగీంద్రులవారు ఉపదేశము–1942 |